# మనుజునకు రక్తమే జీవనము

రక్తమే ప్రాణాధారము. ఈ రక్తము దేహమంతయు నాడుల మార్గమున పారి శరీరపటుత్వమును కలిగించుచున్నది. రక్తము మనము భుజించు ఆహారము నుండి పుట్టుచున్నది. కొందరు తమ శరీరదార్ఢ్యమును కాపాడుకొను మార్గములను మఱచి వ్యాధుల పాలగుచున్నారు. ఇక్కాలపు విద్యావ్యాసంగము ఉద్యోగధర్మములు చాలవరకు మనుజులను అనారోగ్యులుగ జేయుచున్నవి. మఱియు విశేష సంచారము, అకాల భోజనము, మితిమీరిన భోజనము, మనోవ్యాకులము, మొదలగు వాటిచేత మనుజునకు జఠరాగ్ని మందగించి ఆహారమందు యిచ్ఛలేక వ్యాధిగ్రస్తుడగుచున్నాడు. ఈ కారణమువలన కొంతకాలమునకు శరీరమునందు నిరాటంకముగా ప్రవహించెడు రక్తమునకు ఆటంకము గలిగి అశక్తుడై, రక్తముచెడి అజీర్ణము ముఖ్యముగా సంభవించుచున్నది. ఈ అజీర్ణవ్యాధిని ఆధారపఱచుకొని గుల్మము, కడుపుబ్బరము. మలబద్ధము, భేదులు, వాంతి, అరుచి, పాండు, కామిల మొదలగు వ్యాధులు కలుగుచున్నవి — మందబుద్ధి, ధాతుక్షీణము కూడ కలుగుచున్నవి. అపరిశుద్ధ రక్తమువలన శోభ, తీట, మేహపొడ, తామర, మేహవ్రణములు మొదలగు చర్మవ్యాధులు కలుగుచున్నవి.

ధాతుక్షీణము, అశుద్ధరక్తము, రక్తమునకు ఆటంకము కలిగించి పక్షవాతము, సంధివాతము, మొదలగు వాతరోగములు సంభవించుచున్నవి. శ్వాసకోశములు, హృదయము, పిత్తకోశముచెడి, కాసక్షయాదులు, హృద్రోగము, ఉన్మాదము, మూర్ఛ, మొదలగు వ్యాధులు సంభవించును.

సమస్తవ్యాధులకు మూల కారణమగు అపరిశుద్ధ రక్తమును శుద్ధపరచి మనుజుని ఆరోగ్యమును కాపాడుటకు మా 'అమృత' శ్రేష్ఠమయినదని వాడినవారు చెప్పుచున్నారు.

'అమృత' పైవ్యాధులను కుదుర్చుటయేగాక నిలుకడగనుండు తలనొప్పి, కడుపులోమంట, అరిచేతులు, అరికాళ్లు, కండ్లమంటలు, నిక్కాక, నిద్రలేమి, వీటిని నివర్తించును.

'అమృత'లో మూత్రసంబంధమైన జబ్బులను కుదుర్చు ఓషధులు కలిసియుండుటచే మూత్రపు అడ్డు తొలగి ప్రమేహ రోగములను కుదురును. విషములను విరుచుమూలికలు చేరియున్నవి గనుక, విషక్రిమి కాటులవల్లను, రసగంధక, పాషాణాది విషద్రవ్య దోషములవల్లను చెడినరక్తమును శుద్ధియగును.

'అమృత' వలన స్వప్నస్ఖలనము, శుక్లస్రావము, మందబుద్ధి, సుఖ సంకటములు, కీళ్లనొప్పులు మొదలగు జబ్బులు కుదురుచున్నవి. మంచిబలము, రక్తవృద్ధి, ఆరోగ్యము, ఇంద్రియపుష్టి, వాక్చాతుర్యము, దీర్ఘాలోచనశక్తి కలుగుచున్నవి.

**'అమృత' సారవంతములగు మూలికలతోను, రసవంతములగు ఫలములతోను మకరందపూరితములగు పుష్ప జాతులతోను తయారుచేయబడిన ద్రావకము. ఇది బాల్య, యౌవన, కౌమార, వార్ధక్య దశలయందు ఎల్లరు సేవించుటకు దగినట్లు తయారు చేయబడినది.**

**'అమృత' యను నామమునకు తగినట్లు రుచికరముగను యింపైన సువాసనతో నిండియుండునట్లుగను తయారు చేయబడినది.**

12 ఔ॥ బుడ్డి రు. 4-4-0

6 ఔ॥ బుడ్డి రు. 2 4 0

## కేసరి కుటీరం లిమిటెడ్

**15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14**

తెలుగుజిల్లాలకు, నైజాముకు ఏజంట్లు:

**శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ – సికిందరాబాదు**


గృహలక్ష్మి
స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుట కేర్పడిన
సచిత్ర మాసపత్రిక
వ్యవస్థాపకులు
డాక్టరు కే. యన్. కేసరి
ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య
సంపుటము ౨౮]
ఆగస్టు 1955
[సంచిక ౮

# వి ష య సూ చి క






జయజయ గృహలక్ష్మి సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతిమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



# దేవాలయములు — దేవాదాయాలు

నిర్జీవంగానున్న దేవాలయములు పునరుద్ధరించబడాలి.

దేవాలయముల గత చరిత్ర మహోజ్వలమైనది. విద్యావసతులు బహుకొద్దిగా నున్న ఆ రోజులలో దేవాలయములు విద్య, విజ్ఞాన కేంద్రాలుగా విద్యాపీఠాలై ఆధ్యాత్మిక, సాంస్కృతిక, నైతిక, సాంఘిక రంగాలలో సామాన్య ప్రజానీకానికి మార్గదర్శకముగా విలసిల్లినవి. సంగీతం, నృత్యం, శిల్పంలాంటి కళలకు కేంద్రాలుగా కళారాధనకు పోషణకు ఉనికిపట్టుగానుంటూ యుండినవి. కాబట్టే ఆనాటి రాజులు, రారాజులు వాని పరిపాలనా నిర్వహణలోనేమి, నిర్మాణంలోనేమి ఆసక్తి చూపుతూ జాతీయాదాయంలోను, ఆస్తిపాస్తులలోను విశేషంగా కేటాయిస్తుండేవారు. దాని వల్ల దేవాలయాలు వైభవోపేతంగానుండి ప్రజలలో చైతన్యాన్ని పూరిస్తూ వాని ప్రభావం ప్రజాజీవితంపై అమోఘంగా నుండేది.

ఇప్పుడు రోజులు మారాయి. దేవాలయాల పోషణ, నిర్మాణాలకు జాతీయాదాయం వినియోగపడడంలేదు. క్రమంగా అనేక దేవాలయాలు శిథిలావస్థకు

రాసాగినవి. శిథిలావస్థలోకి వచ్చిన వానిని కొందరు శ్రీమంతులు ఉద్ధరించ పూను
కొనినా, మరి కొన్ని ఆనాటి మహారాజులు, శ్రీమంతులు యిచ్చిన భూ,సంపద్దాన
ముల వసతులతో కొంత ఉద్ధరించబడినా మొత్తంమీద పూర్వపు వైభముకాని,
విశిష్టతను కాని కోల్కొనగలస్థితిలో లేవు.

ఈ దేవాలయాలలో కొన్నిటికి విశేష ఆస్థి పాస్తులు, ఆదాయము కలవి
యున్నవి. మరి కొన్ని అవి ఏవియు లేకుండా శిథిలావస్థలోనున్నవి. మొత్తం దేవాదా
యాలను సక్రమంగా నిర్వహించి జాతీయశ్రేయస్సుకు వానిని వినియోగించే సందర్భమున
జీర్ణావస్థలోనున్న దేవాలయాలను పునరుద్ధరించి వానిని ప్రజోపయుక్తమయిన కళా
కేంద్రాలుగా, విద్య విజ్ఞాన కేంద్రాలుగా, సమరస సద్భావ సమైక్యతల ప్రోత్సహించు
కూడలి ప్రదేశములుగా, పారమార్థిక, ఆధ్యాత్మిక చింతలను ప్రబోధిస్తూ దైనందిన
ప్రజా జీవితంలో మార్గదర్శకంకావాలి. దేవాలయాల పునరుద్ధరణకు సామాన్య
ప్రజానీకపు ఆసక్తి ఎక్కువ కావలసియున్నా ప్రభుత్వము సయితము జాతీయాదా
యాన్ని, దేవాదాయాలను సముచితంగా వినియోగపర్చడం వాంఛనీయము.



## శ్రీమతి కానుమిల్లి వెంకట నరసమ్మగారి వితరణ

కన్నాపురం వాస్తవ్యురాలు స్వర్గీయ శ్రీ కానుమిల్లి జగ్గారాయుడు (బారిష్టరు)గారి సతీమణి
శ్రీమతి కానుమిల్లి వెంకటనరసమ్మగారు పశ్చిమ గోదావరిజిల్లా పోలవరం తాలూకా కొయ్యలగూడెం
గ్రామంలో గత సంవత్సరం దివాన్ బహద్దూర్ బండి శ్రీ శ్రీహరిరావు నాయుడుగారి కృషితో నెలకొల్ప
బడిన శ్రీ గెడా గెరటయ్య బోర్డు హైస్కూలులో "మద్దిపోటు వెంకటరత్నమ్మ హరిజన్ హాస్టల్"
కట్టుటకు పదివేల రూపాయలు (హాస్టల్ భవన నిర్మాణానికి అయ్యే ఖర్చులో సగం) యివ్వడానికి తమ
సంసిద్ధతను ప్రభుత్వానికి తెలియబరిచారు. ఆంధ్ర ప్రభుత్వం మిగిలిన సగం డబ్బు గ్రాంటు చేసింది.

శ్రీమతి వెంకటనరసమ్మగారు ఇదివరలో ఆంధ్ర విశ్వవిద్యాలయానికి విద్యార్థులకు బహుమతులిచ్చే
నిమిత్తం రు. 18,000/లు, కొయ్యలగూడెం హైస్కూలుకు రు 15,000లు, చెన్నపట్టణం కేసరి తెలుగు పాఠ
శాలకు రు. 4,000/-లు, కొవ్వూరులోని సంస్కృత బాలికా పాఠశాలకు రు. 3,000 లు- మొత్తం 40 వేల
రూపాయలు విరాళా లిచ్చారు.

వైద్యసహాయం కొరకు కొయ్యలగూడెం మిషన్ హాస్పిటలులో ఒక వార్డుకు రు 5000లు, కన్నాపురం
రూరల్ మెడికల్ డిస్పెన్సరీ వుంచుటకు 10 వేల రుపాయల కిమ్మత్తుగల భవనం యిచ్చారు.

కన్నాపురంలో లేడీ డాక్టర్‌ను సర్కారు వారు నియమించే పద్ధతిని తాను బిల్డింగు వృద్ధి చేయుటకు
స్థలం, 10,000 నగదు ఇస్తానని యిప్పుడు ఆంధ్ర ప్రభుత్వానికి తెలియపరచారు. ఈమె మొత్తం ఈ నెల 75
వేల రూపాయల విరాళములు ప్రజోపకారంకొరకు యిచ్చారు.

# వీరనారి

శ్రీ పి. వి. తాతాచార్యులు

[శత్రురాజులు దండెత్తివచ్చునపుడు తన భర్తయైన సేనానాయకుని యుద్ధభూమికిపంపి, ధనమున కాసనుచెంది పరరాజులతోగూడి దేశమునకు ముప్పు తెచ్చెడి సమయమందు, తానే పురుష వేషమునుదాల్చి సేనానాయకుని కార్యము నిర్వర్తించి జయలక్ష్మినిదెచ్చి రణరంగమందు వీరస్వర్గమునొందిన "వీరనారి" గాథ ఇది]

'పరరాజ సేనలు పైకొనివచ్చె
అతుల సాహస వృత్తి నవిగో చూడండి!
అల్లదే రణభేరి! అల్లదే వినుడు!
కదలి పొండిప్పుడే కదన భూమికిని
ఇంటిలో కూర్చుండ నిది సమయంబ!
అదె కత్తి! అదె డాలు! అవియె దుస్తులును!
కొండపై గొట్టిన కుండ పెంచికల
చందాన యిటునటు సైన్యమంతటిని
ప్రభుభక్తి పరుడవై రణరంగమందు
తరిమి పేరునుపొంద తగు నాయకుడవు!
మాటల కెడలేదు ఖండనంబునకు
వేచియున్నారదె! వీర నాయకులు
కత్తిని చేబూని కలహింపబోయి
రుధిరధారలను విరోధుల్కు జూపి
ప్రాణము లున్నంతవరకు యుద్ధమును
చేసికీర్తికె పాటు చెందండి' యనుచు
జయలక్ష్మి నిండేవ సమరంబునకును
పంపెనా యిల్లాలు మంగళ ధ్వనితో
రణభేరి మ్రోగించి రణరంగమునకు
పోయెను తానును పురుష వేషముతో.

♦ ♦ ♦

క్షణకాలమందున సైన్యాలు రెండు
కలసి పోరాడె లోకమ్ములు బెదర
వెనుకటి రాజుల విక్రమస్ఫూర్తి
చూపి పోరాడిరి చోద్యంబు గొలుప
క్షణకాలమందు పుర్రెలు మింటకెగసి
దబ్బు దబ్బునవ్రాలి తడిసె రక్తమున.

♦ ♦ ♦

ఇంతలో జరిగిన దేదియోగాని
జయలక్ష్మి వచ్చెడు సమయంబునందు
'పరరాజులంగూడి ప్రభుభక్తివీడి
చేయుచు న్నాడు సేనాని యిపుడు
సేనాని లేనిచో చేయునదేమి?'
అంచు భీతినిచెంది అటుయిటు చెదరె

♦ ♦ ♦

చెదరి పారుచున్న సేనలంజూచి
'భయపడి వెనుకకు పారిపోనేల?
సేనాని లేనిచో సేనాని పనిని
చేయనున్నాడను చింతిలనేల?
ప్రాణ రక్షణకునై రణరంగమందు
వెనుకంజ వేయుట వీరధర్మంబ!
ధైర్యమ్ము వీడి నుత్సాహమ్ము వదలి
వెన్నిచ్చి పారిన విఖ్యాతిరాదు!
ఇయ్యదే సమయంబు యెంచి చూడంగ
వికలాంగులఁజేయ వీరులందరిని!
ఎదిటివారికి జూప నియ్యదే వేళ
భారతావనియందు పౌర విక్రమము!
పరరాజ దళముల పటిమ క్షీణించె
రణభేరి మ్రోగించి రణముకై వచ్చి
గజములపైకి సింగమ్ములు దూకు
చందాన దూకి స్వసైన్యంబు చేసి

వీరనాయకులార విఖ్యాతిగొనుట
కియ్యదే వేళని యెంచండి మదిని !
గెల్చినా ఓడినా కీర్తికై పోరు
సల్పండి ! తప్పక జయము చేకూరు !
దైవంబు మనపాల దయచేసినాడు
సమరాన తప్పక జయము చేకూర్చు !
పరుల గంజిని త్రాగి బ్రతుకుటకంటె
పోరున ప్రాణముల్ పోవుటే మేలు !
బానిస బ్రతుకులు బ్రతుకుటకంటె
ఎరగలింబడి మేను నిచ్చుటే మేలు!'
ఎవ్వడో మధ్యను యివ్విధంబయిన
ధీరవాక్కులు పల్కి ధీరతనొంది
భయపడి వెనుకకు పాఱు సైన్యంబు
ఒక్కసారిగ లేచె నుగ్రతేజమున

♦ ♦ ♦

తోక త్రొక్కిన త్రాచు తుట్టల పగిది
చేతికందినవారి చెండాడుచుండ
పదునాల్గు భువనముల్ భయమందుచుండ
రక్తమ్ము కాల్వలై ప్రవహించుచుండ
అందులో మొండెము అటునిటునాడ
శిరములు తెగి నేల చిందులు త్రొక్క
రామ రావణ యుద్ధరంగమ్ము మరచి
'కర్ణుండు విజయుండు కలహించునపుడు
పుట్టంగ లేదింత పోరని' యెంచి
ఆకాశ మార్గాన అటు యిటు తిరుగు
అనిమిషులందరు నాశ్చర్యమంద

♦ ♦ ♦

ఇంతలో తన భర్త యెదురుగ నిల్చి
కత్తిని విసరెను ఖండించ శిరము
కత్తి కడ్డంబుగ కత్తినియుంచి
'కాసు వీసమ్ములకై - ఆశ చెంది
పరరాజులంగూడి ప్రభుభక్తి విడచి
దేశానికే ముప్పు తేవ బూనితివి !
నివసించు యింటికే నిప్పు బెట్టితివి !
దాటిన తెప్పనే తగుల బెట్టితివి !
కట్టిన కొంపనే కాలదన్నితివి !
నీతోన యుద్ధంబు నే జేయుటిపుడు !
నీవును మనిషివ ! నీకు యుద్ధంబ !
ఛీ ! పొమ్ము ! ప్రక్కకు చెనట రాక్షసుడ !'
అంచు, చద్రున కత్తి ఆమె రోషమున
తీసి యింకొక్కని తెగవేయబోవ
అతికోపమున కోసె నామె శిరమ్ము

♦ ♦ ♦

కొండ విధంబుగ కూలిన క్షణమె
'ఆమెయే తన భార్యయేట' జూచతడు
'దేశమ్ముకే కాక దేశమ్ము నేలు
పతికి తెచ్చితి ముప్పు పత్ని నిజంపి
తీరని కలుషమ్ము తెచ్చితి' నంచు
చేసిన దానికి సిగ్గును చెంది
అసువులన్ విడచెను ఆ యమ చెంత.

♦ ♦ ♦

పౌరులు చూపిన పటిమకు దేశ
భక్తికి జయలక్ష్మి వచ్చె నచ్చటికి.
జయభేరి మ్రోగింది ! శత్రువులడగ.

—(o)—

వేసవి నృత్య పాఠశాలగా మద్రాసు — త్యాగరాయనగరు హిందీ ప్రచారసభ ఆవరణలో ప్రారంభమయిన శిక్షణా కేంద్రము శ్రీ రమణారావు, సామ్రాజ్యం గారల అధ్వర్యమున క్రమమైన పాఠశాలగా రూపొంది నిర్వహించబడుచున్నదని తెలియుచున్నది. వివరములకు శ్రీ యస్. వి. రమణారావు, 17 పెలాతోపు మద్రాసు-4 కు వ్రాసి తెలిసికోవచ్చు.

# ఈశావాస్యోపనిషదు

పూజ్యపాద శ్రీ స్వామీ చిన్మయానందజీ.

## సూక్ష్మ శరీరము

(గతసంచిక తరువాయి)

ఇట్లు, సర్వసాధకుల గమ్యస్థానము ఈ అవిద్యను నాశనముచేయుట అనగా, మన విషయపూరిత కోశములతో తాదాత్మ్యము పొందుట తొలగించుకొనవలెను. సామాన్య మానవుని కష్టములు బాగుగ గమనించిన ఋషులు ఇట్టి ఉపదేశమును ప్రేమ పూర్వకముగా తెలిపియున్నారు. ఈ అవిద్యను తొలగించుట ప్రత్యక్షముగా సంభవించుటకు, సులభమైన మార్గము బాహ్య ప్రపంచమున మన కార్యములను నియమించుటవల్లనే సాధ్యము. కనుక, ప్రపంచమున సర్వ మతములయందును, దైనిక, సాంఘిక నియమముల పరిపూర్ణత ఆవశ్యకముగా ఏర్పరచియున్నారు. ఇట్టి నియమములుగల గుణసంపన్నులే, దేవాలయముల, చర్చిల, మసీదుల, గురుద్వారుల, ప్రాకారములను ప్రవేశింప అర్హులని నియమించియున్నారు. ఈ కాలములో, ఇట్టి నియమిత గుణసంపన్నులే లేని వారందరు, ఇట్టి పావనక్షేత్రములలో నిండిపోవుచున్నారు. కాని, వారు ఎంత శ్రద్ధతో, విశ్వాసముతో బాహ్యనియమిత కార్యక్రమాలను గమనించినను, జన్మాంతము పూజలు సలిపినను, భక్తి చూపినను, వారు తొలుత భగవంతునికి ఎంత దూరము యుండిరో, కడదినమునకూడ అంత దూరముననే యుంటున్నారు.

ప్రపంచమునగల సర్వమతములయందును, నియమింపబడియుండు నీతి, మర్యాదల తారతమ్యమును సరిపోల్చి విమర్శించి చర్చించుటకు తగుకాల వ్యవధి నాకు లేకున్నది. అందుకు ఇది సమయమునుకాదు. కొంత చురుకుగా కార్య క్రమము నడుపగలిగినయెడల హిందూ మతమున వీటికిగల విలువను గమనించ మాత్రము సాధ్యముకావచ్చును.

హిందూమతము స్థాపింపబడియుండు శిలాస్థాపకములు మూడు. వాటి గుణాదిమీద ఈ మతము ఆధారపడి బ్రహ్మాండముగ పెరిగియున్నది. అవియే సత్యము, అహింస, బ్రహ్మచర్యము. హిందూదేశమున ప్రతి పుస్తక భాండాగారములలో నెలకొనియుండు గ్రంథముల రాసులన్నియు ఈ మూడు పదములమీద వ్రాయబడిన, టిప్పణములు, కారికలు, వ్యాఖ్యానములు. హిందూ ఆర్యసంతతియొక్క విజ్ఞానసంపదయంతయు, వారి జీవన విధానము, ఆలోచనలు, అనుభవములు, అంతయు ఈ మూడు పావన గుణాది శిలలపైన నిర్మింపబడియున్నవి. ఉపనిషదు ఋషుల సంతతివారంతయు, తమ వ్యక్తిగత, గృహసంబంధ, వర్ణగత, సాంఘిక, జాతీయ, అంతర జాతీయ జీవిత విధానములన్నియు, మానవుడు తనకు తాను చెల్లించుకొనవలసిన ముఖ్య ధర్మమార్గములమీద నెలకొల్పియున్నారు.

ప్రస్తుతము బాణవిమానములు, క్షణిక వేగ ప్రయాణములతోనిండిన వ్యాధి స్వరూప అశాంతి జీవిత వ్యవహారములలో, మానవుని నిత్యసామగ్రి సమకూర్చుకొన దినమున 24 ఘంటల వ్యవధి చాలకయున్నది. ఇట్టి అవస్థలో, పైతెలిపిన విజ్ఞాన సంపదనంతయు మీకు "మీరే పఠించి తెలుసుకొనుడు, అందలి ముఖ్యతను గమనించగలరు" అని సలహా నిచ్చుట వట్టి వెఱ్ఱితనముగా యుండును.

కాని మన భాగ్యమేమన, పూర్వకాలపు జన సంతతికన్న, నేటికాలపు సమూహము మిక్కిలి చురుకైన విజ్ఞాన సంపద కలిగియున్నారు. పూర్వకాలపు వారికన్న అసంఖ్యరెట్లు విచక్షణ చూపగలవారుగా నున్నారు. ప్రకృతియందు సమత్వము తనంతతానే

నెలకొనియుండును. కనుక, మీరు, పైవిజ్ఞాన సంపద లోనికి ముఖ్య సూక్ష్మాంశముల రహస్యములను తెలిపిన యెడల, మీరు విజ్ఞాన గ్రంథముల సమూహమును పఠించ నవసరము లేకయే, అందలి రహస్య సూక్ష్మములను జీవితములో ఉపయోగ పెట్టుకొనగలరు.

సత్యం - (నిజము పలుకుట) - ఈ వాక్యమునకుగల ముఖ్యత మనకు అతిపరిచయమయి యుండుటవల్ల, ఒక వ్యక్తి, నిర్ణీత సంఘటనమున ఎట్లు వ్యవహరించుకొన వలెనో నిర్ణయించుటకు సమర్థతలేకున్నాము. చాల విపులాంశములను తెలుపక, దీనియందుగల బోధ సారమును మాత్రము తెలుప ప్రయత్నించెదను.

బ్రహ్మచర్యము - లేక ఇంద్రియ నిగ్రహము - అనగా కేవల సంభోగవాంఛలను అరికట్టుట మాత్రము కాదు. మన జీవిత వ్యవహారములలో కృషిచేయు సర్వ ఇంద్రియములను వాటి విషయ వ్యాపారములలో చక్కని నిగ్రహము లేక నియామకము చూపుచు జీవయాత్ర గడుపుట. అనగా,హద్దుమీరి మాట్లాడుట, చాల దూరము కాలినడక సాగించుట, ఆకలికిమించి ఒక పిడికెడు ఆహారము అధికముగ భుజించుట, అన్నియు బ్రహ్మచర్య వ్రతమునకు భంగముచేయు దుర్వ్యాపారములు.

ఇట్లు బ్రహ్మచర్యము జీవిత కళాంశమును, విషయావరణములో వ్యవహారరీత్యా ఉపయోగించుటగ నున్నది. అహింస యనునది, జీవితకళాంశమును మనో ఆవరణమున జీవింప ప్రయత్నించుట. అహింస యనగా, నిశ్చేష్టత మనోభావముతో ఇతరులచేత చంపబడుటకాదు, పీడించబడుట కాదు, పిరికితనము అహింస వ్రతము కాజాలదు.

అహింస అనుటకు, నిజమైన దివ్య ఉద్దేశమేమన, "మృగభావములో హింసించ తలపవద్దు." మన యుద్దేశముల వ్యవహారమంతయు హింసకలిగించ కూడదు అను దివ్యభావముపొంది యుండవలెను. క్రూరత్వము ద్వేషముతో మన భావములు మాలిన్యము పొందకూడదు. కనుక నీ యింటిలో దొంగ జొరబడినప్పుడు వానిని ఎదిరించి మార్కొనిన అది హింస కానేరదు. ఒక పౌరోహితుడు తెల్పిన భావము నీకు నచ్చకపోయిన, ఒక రాజ్య ప్రతినిధి విధించిన ఆజ్ఞ నీకు న్యాయముకాదని స్థిరమైన యెడల, వాటిని తిరస్కరించుట హింసభావము కాజాలదు. ఒక దోమను, నల్లిని, పామునో, తేలునో చంపుట హింస కాజాలదు. వాటిని విచ్చలవిడి పెరుగనిచ్చి క్రూర కార్యములుచేయుచుండుటను సమ్మతించుట బట్టి వెఱ్ఱితనము. ఇట్టి విపరీత వ్యవహారములవల్లనే, శోభాయమాన హిందూమతము అధోగతిపొంది సామరూపములులేని స్థితికి వచ్చినది. దుష్టనిగ్రహము, శిష్టపరినము ప్రతి నిజహిందువునికిని ధర్మమైయున్నది. - పురోహితునికిగాని, దేవునికిగాని, రాజ్యపాలనవర్గమునకుగాని.

ఇట్లు అహింస అనునది, హిందూధర్మ నిర్మాతలు ఉపదేశించిన, కార్యభావములలో ఉపయోగించగల జీవితకళ. మన భావములు అహింసతోకూడి, ఆశీర్వాద పూర్వకములుగాను, నిర్మలముగను యుండవలెను. ఇట్టి కార్య నిర్మాణమున మనము మన ఉద్యాన వనము శోభాయమానమగుటకొఱకు, అందు పెరిగియుండు ముండ్లకంపలను, కలుపును తీసివేయవలెను. ఇది హింసాకార్యము కాజాలదు.

సత్యము - సత్యవ్రతము మన ఆంతర విజ్ఞాన ఆవరణమున వ్యాపించియుండవలసిన దివ్య సంకల్పము. బాహ్య ప్రపంచమునుండి మనము కొంత అనుభవములు పొందుచున్నాము. ఈ అనుభవములను మనసులో పచనము చేయుచున్నాము. ఇట్లు పచనము గాంచిన విజ్ఞానము జీర్ణంపొందబడి ఒక నిశ్చిత తీర్మానమునకు తెచ్చుచున్నాము. పిమ్మట సత్య బలమువల్ల, మన విజ్ఞాన తీర్మానమువల్ల నమ్మక వ్యవహారము జరుపగలశక్తి పొందుచున్నాము. ఈ బాహ్య ప్రపంచమంతయు ఒక విశ్వ విద్యాలయము. అందు మనమందరము ఉచిత విద్యార్థులము. ప్రకృతి ప్రతిదినమును, క్షణక్షణమును, వివిధ అనుభవ సమూహముల మూలమున నేర్చుకొనదగు అవకాశములు కల్గించుచున్నది. ప్రకృతియొక్క ఇట్టి రూపులేని లిపిని చదువుటను, తెలుసుకొనుటకును, మనసు, బుద్ధి

అనుకరణములు పొందియుండు మనుష్యుని కొక్కడికే జీవరాసులలోకెల్ల, సాధ్యముగా నున్నది. ఈ రీతి జ్ఞానముపొంది, మానవుడు తాను సంపాదించిన జ్ఞాన రీతి వ్యవహరించ బాధ్యత కలిగియున్నాడు. కాని మనలో చాలమంది అట్లు చేయుటలేదు. కనుక దాని ఫలితముగా దుఃఖముల పాలగుచున్నారు. మనలో చాలమంది ఈ మనసును, బుద్ధిని ఉపయోగించు విధానమే మరచియున్నారు. ఇట్లు నిరుపయోగావస్థవల్ల ఇవి వాటికిగల ప్రకాశ సామర్థ్యములను కోలుపోయి యున్నవి. "మీయొక్క పూర్వ అనుభవజన్య జ్ఞానమును సత్య మార్గమున 'అవలంభింపుడు" అని తెలుపుచు, నిర్భంద పెట్టుచు, మతము మనలను, నిరంతరము, నిపుణత్వముతో, మన మనసు, బుద్ధులు అను సూక్ష్మ శరీరమును వ్యవహారమున ఉపయోగించవలెనని కోరుచున్నది.

ఇట్లు ఈ మూడు గొప్ప జీవితకళలకుగల అభిప్రాయములు, వాటియొక్క ప్రాముఖ్యత చక్కగ గ్రహించగలిగిన యెడల, ఈ మూడు పదములమీద వ్రాయబడి ప్రపంచమునందంతట వ్యాపించియుండు సంస్కృత ధర్మశాస్త్ర గ్రంథములన్నియు నిండియుండు సారమును గ్రహించినవారమగుచున్నాము.

ఒక వ్యక్తి ఇట్టి పరిపక్వ ఆత్మ నిగ్రహముతో జీవింపగలిగిన యెడల, ఎల్లప్పుడు అనుభవించిన సంఘటనలనుండి జ్ఞానమార్జించుచు వచ్చిన యెడల, అహింస, జ్ఞానబోధిత సత్య వ్యవహారమును, ఆంతర జీవితము కొన్ని వత్సరములు సలుపగలిగిన, అతడు ప్రకృతికి ప్రియ పుత్రుడై, మానవాతీత - ఉన్నత పదవియందు స్థాపింపబడుచున్నాడు. ఈ పవిత్ర యాత్రయందు కడపటిదాటు, మతధర్మములయందు తెలుపబడిన వివిధయోగాభ్యాస ములవల్ల నెరవేరుచున్నది. మన దుఃఖ వేదనలనుండి, ప్రశాంత ఆనంద పదవిని, మానవత్వమునుండి, దైవత్వమును సిద్ధించుటకు, హిందూమతమున నాలుగు విధముల యోగమార్గ విధాయకములు తెలుపబడి యున్నది. ఇవి, నాలుగు మార్గములు -భక్తి, జ్ఞాన, కర్మ, మరి, హఠయోగ మార్గములు. ఇవి ఒకటికొకటి విరుద్ధములు కావు. శత్రుత్వము కలిగినవి కావు. కాని అవి అన్నియు, ఏక గమ్యస్థానమువైపు వాలియున్నవి. ఈ విచారము రేపటి పాఠముగా యుండును. ప్రపంచమున ఏ ఇతర మతమునగాని, ఇన్ని రకముల విధానములతో ఆనంద స్వరూపమును, సంతోషపూరిత మార్గముల ద్వారా పొందగల సూచనలు నిర్మింపబడి యుండుట లేదు.

బౌద్ధమతమునతప్ప మిగత అన్ని మత ధర్మములలోను, విసుగుచెందక, వూగులాడుతూ, దుమ్ముతో కాళ్లు లాగుకొనుచు పోగల, ప్రాచీన, ఏకైక మార్గము - భక్తిమార్గము యొకటియే నిర్మింపబడి యున్నది. ఇట్టి నిర్భంధములవల్ల, సహనత్వముతో సర్దుబాటు పొందగల సౌకర్యములు లేనందువల్ల ఇతర మతస్థులు, వారి మతమును అతిక్రమించి, నూతనపచ్చిక బైళ్లలో రుచికర ఆహారమును మేయుటకై, నడక సాగించి, కడకు, హిందూమత విశాల దేవాలయ భవనములలో ఆగామ జీవిత సౌకర్యమును కనుగొనుచున్నారు.

ఓం. ఓం. ఓం.



# తెల్లరోజా!

రచయిత్రి :
ఇన్‌గే షోల్స

అనువాదము :
డాక్టరు వి. ఎన్. శర్మ

["తెల్లరోజా" వుబుసుపోవడానికి వ్రాయబడ్డ కట్టుకథ కాదు. పుక్కిటి పురాణమూ కాదు, మన కాలంలోనే నిజంగా జరిగిన కథ. జర్మను విశ్వ విద్యాలయపు విద్యార్థులూ, విద్యార్థినులూ, తమ దేశపు సంస్కృతినే ఆమూలాగ్రంగా పీల్చి పెల్లగించడానికి ఆ దేశంమీద అమాంతంగాబడ్డ నాజీ వుప్పెన్ని ప్రతిఘటించడానికి అవలంబించిన కార్య కలాపాన్ని యథాతథంగా చిత్రించే సాహిత్య శిల్పాన్ని ఈ కథలో మనము కళ్లార చూడవచ్చు. దీనిని రసోపేతంగా చిత్రించిన రచయిత్రి ఇన్‌గేషోల్స అనే వీరవనిత. ఈమె తమ్ముడు హాన్స్, చెల్లి సోఫీ. ఈ విద్యార్థుల విప్లవాన్ని నడపడానికి ముందంజ వేశారు. వారి ఆదర్శాలూ, ఆశయాలూ, మహత్తరమైనవి. వాటిని నిర్విఘ్నంగా కార్యరూపాన పెట్టడానికి నదురూ బెదురూ లేక చేయాలసిన త్యాగాన్ని చేశారు. ఇది ఆ కాలపు ప్రభుత్వ దృష్టిలో మహాపరాధం, రాజద్రోహం, దేశద్రోహం, ఆ నేరానికి రచయిత్రి చెల్లీ, తమ్ముడూ వురిస్తంభాల్ని ఎక్కి ప్రాణాల్ని కోలుపోయారు. ఆ దుర్భరావస్థలోకూడా వీరిద్దరూ, వీరితో ఉద్యమాన్ని జయప్రదంగా నడిపిన వీరితోడి విద్యార్థినులూ, విద్యార్థులూ - అంతేకాదు ఈ విప్లవానికి శాయశక్తులా తోడ్పడిన వారి ప్రొఫెసరూ జర్మను దేశపు పేరు ప్రతిష్ఠల్ని నిలబెట్టడానికి ఏమాత్రమూ తటపటాయించక ధన్యులయ్యారు. ఈ సాహస కార్యాల్ని రచయిత్రి కళ్ళార చూసింది. తనూ ఆ కార్య సాఫల్యానికి చేయాలసిన త్యాగాన్ని చేసి కృతకృత్యురాలయింది.

ఈ వీరగాథనే ఇన్‌గేషోల్స మనకు చెబుతూ నాజీ ఉద్యమము ఆ దేశంలో పెనప్రాకి పోవడానికి కారణాలూ, ప్రారంభాన నాజీ ఆదర్శాలు ఆబాల గోపాలాన్ని ఎలా ఆకర్షించాయో, తరువాత వాటిని అవకాశవాదులు తమ స్వలాభానికి ఎలా వుపయోగిస్తూ, ప్రజాకోటిని దుర్భరావస్థలోకి ముంచేశారో, ఆ దుర్భరావస్థలోనుంచి బయట పడడానికి పెద్దలు ఒక వైపునా యువకులు మరొక వైపునా చేసిన త్యాగాన్ని కళ్లకు అద్దినట్లు చక్కగా మనకు చిత్రిస్తుంది.

(1118 పేజీ చూడుడు)

# "రాగవర్ధని"

'విజయ - రాఘవ'

[రజనీకాంతుడు, రాగవర్ధని ఒకరినొకరు ప్రేమించుకొంటూ, పవిత్ర మూర్తులుగా జీవయాత్ర గడువ సాగింది. రజని తండ్రి కఠినుడైనా తల్లి మాత్రం కుమారుని మంచిచెడ్డలను గురించి రెపరెపలాడుతుండేది. రజని మాత్రం మహా పట్టుదలతో తోబుట్టువులను సయితము తనకోసర మని వచ్చినప్పుడు కసిరిపంపేస్తుండేవాడు. చెల్లెలిపిలుపు ననుసరించి రజని వాళ్లింటికి వెళ్లాడు. అన్నయ్యను భువనేశ్వరి తను యిల్లువదలి ఎందుకు బయటయుంటున్నాడో అడుగాలనుకొంది కాని నోరురాలేదు. ప్రక్కయింట్లోనేయున్న స్నేహితురాలు సువర్చల యింటికి ఆ రోజునే రాగవర్ధని వచ్చింది. సువర్చలగారి కుటుంబం, భువనేశ్వరిగారి కుటుంబం చాల సన్నిహితంగా నుంటుండేవారు — యిక చదువండి]

(గతసంచిక తరువాయి)

"మనింటికి చుట్టాలొచ్చారండి" అంది.

"శుభం! చాలా సంతోషం. ఏరీ" అంటూ లోపలికి తొంగిచూస్తూ, వస్తూండగా - రాగవర్ధని కుర్చీలోంచిలేచి, తలవంచుకొని ప్రక్కగా నిలుచుంది.

"ఫరవాలేదు కూర్చోమ్మా" అంటూ క్రాంతీనాథ్ పుస్తకాలు టేబిల్ మీదపెట్టి చొక్కా విప్పుతున్నాడు.

సువర్చల, రాగవర్ధని ప్రక్కగా వెళ్ళి "ఫరవాలేదులే! మావారే" అంటూంటే క్రాంతీనాథ్ తనలో తాను నవ్వుకొంటూ గదిలోకి వెళ్ళిపోయాడు.

"ఇంకా గదిలోకెందుకు. తుండుగుడ్డ లిక్కడే వున్నాయి. స్నానానికి లేవండి. మామూలువేళ దాటింది" అంటూ సువర్చల రెండు తువ్వాళ్ళను గదిలోవున్న క్రాంతినాథ్ కి అందించింది.

"నీ స్నానమైందా" అన్నాడు క్రాంతీనాథ్.

"ఆ ... అంటూ వేన్నీళ్లు బయటపెట్టి వచ్చింది.

క్రాంతీ స్నానానికి వెళ్లాడు. సువర్చల, రాగవర్ధని కెదురుగా కూర్చొనివుంది. రాగవర్ధని గోడలకు తగిలించివున్న ఫోటోలు చూస్తూ—

"సువర్చలా! మీ వారి పేరేమిటే" అంది.

సువర్చలకు పెళ్ళికూతురుగా అయిననాటిసిగ్గు ఒక్కసారిగా వచ్చినట్లనిపించింది ఆ మాట వినగానే. కాని, అడిగిన వెంటనే చెబితే బాగుండదనిపించింది.

"నా పెళ్లికి నీకు శుభలేఖ యిచ్చాగా! అందులో చూడలా" అంది సువర్చల.

"చూసానే! కాని గుర్తులేదు" అంది రాగవర్ధని.

"ఒకవేళ మళ్ళీ పెళ్లిచూడు గుర్తొస్తుంది" అంది సువర్చల.

"అబ్బా! పోనీద్దూ! దాచుకోవే చెప్పపోతే!"

"అది కాదే! వర్ధనీ! చెప్పాలనివుందికాని, సిగ్గేస్తోందే. ఎలా చెప్పను?"

"ఫరవాలేదులెద్దూ!"

"చెప్పాల్సిందేనా! తప్పదా!"

"ఇందులో తప్పేదేముంది. పేరు చెప్పడానికే యింత సిగ్గయితే యెలాగే!"

"క్రాంతీనాథ్" అంటూ చెవుదగ్గరగా వెళ్ళి నెమ్మదిగా వూదింది.

"యీ కాస్త భాగ్యానికి యింతసేపు వూరించావ్ గదూ!"

"నీకలాగే వుంటుంది. వర్ధనీ! నీకూ పెళ్ళయితేగాని, యీలాగే యెవరైనా అడిగినప్పుడుగాని తెలియదు."

"సరేగాని! యిందాకట్నుంచి అడగటం మరిచిపోయాను. నీ పెళ్ళెప్పుడే" అంది సువర్చల.

"పెళ్ళి ... నా పెళ్ళి ... అవుతుంది. నిన్ను తప్పకుండా పిలుస్తాగా. మరిచిపోను. స్వయంగా నేనేవచ్చి, శుభలేఖయిచ్చి వెంట తీసికెడతా. సరేనా" అంది రాగవర్ధని.

"ఎప్పుడే" అంది సువర్చల.

"నీతో కొన్ని విషయాలు చెప్పాలనుకొంటా. మళ్ళా సిగ్గేస్తోంది."

"అదేమిటే! చెప్పు ఫరవాలేదులే."

"అలాగైతే ముందు నీవుకూడా భోంచేసిరా!" అంది రాగవర్ధని.

ఇంతలోకే క్రాంతీనాథ్ స్నానాలగదినుండి వూడిపడి, పట్టుబట్టకట్టుకొని వంటయింట్లోకి వెళ్ళడం సువర్చల చూసింది.

"అయితే వారిని లేవనీ! యిద్దరంకలిసి తర్వాత తిందాం" అంది సువర్చల.

"నా భోజనం అయిందే" - అంది రాగవర్ధని.

"తింటే తిన్నావులే తిన్నంతే తిందుగాని" అంటూ సువర్చల లేచివెళ్ళింది అన్నం వడ్డించడానికి.

కంచంలో అన్నంపెడుతూ - "ఆ అమ్మాయి యెవరో తెలుసుటండీ" అంది సువర్చల.

"ఎక్కడో చూసినట్లుగుర్తు. కాని జ్ఞాపకం రావడంలేదు" అన్నాడు క్రాంతీనాథ్.

"మన పెళ్ళిలో సత్యనారాయణ వ్రతం రోజున మంగళ హారతి పాడలా! ఆ అమ్మాయి" అంది.

"అవును. గుర్తు కొచ్చింది. మరి యిప్పుడేం చేస్తోందిక్కడ?"

"వాళ్ళ పెద్దమ్మ దగ్గర వుంటోంది."

"ఏం తల్లిదండ్రులులేరా?"

"లేరు."

"చిన్నప్పుడేపోయారా!"

"అసలది తల్లిదండ్రులనే యెరుగదు. అదంతా ఒక గాథ."

"నీకెట్లా తెలుసు?"

"ఎట్లా తెలుసేమిటి?" అది నేను చిన్నప్పటి నుంచీ పెళ్ళయ్యేదాకా మేమిద్దరము ఒక చోటే చదువుకొన్నాం. అక్కా చెల్లెల్లకన్నా యెక్కువగా వుండేవాళ్ళం. తెలియనివాళ్లు మా యిద్దర్నీ చూస్తే ఒక తల్లి పిల్లలనుకునేవాళ్లు. నేను పుట్టక ముందు మావూళ్లో మా యింటి వెనకాల అంతా పాటిదిబ్బలు గోతులుండేవట. ఒకనాటి రాత్రి ఆ గోతుల్లోంచి పసిబిడ్డ యేడుపు వినిపించిందిట ఆ చుట్టుప్రక్కల యిండ్లలో కొంతమందికి. కాని యెవరికి వారే వూరుకున్నారట. కాని మా యింటికి వంద గజాల దూరంలోవున్న శకుంతలమ్మ అనే పంతులమ్మ గారు ఆ అర్ధరాత్రివేళ లాంతరు పుచ్చుకొని ఆ గోతుల్లో వెతకడానికి వెళ్ళిందట. చిమ్మ చీకటి.

"కాస్తన్నంపెట్టు" అన్నాడింతలో క్రాంతీనాథ్.

సాగుతున్న కథను తుంచకుండా, అన్నంపెడుతూ "కన్ను పొడుచుకొన్నా కనిపించడంలేదట యేమీ

కూడా. లాంతరు వెలుగుబడి ఆ పసిపాప యేడుపు మానేసి వూరుకొందిట. చివరకు గోతులన్నీ వెతకగా, ఒక గోతిలో, ఒక చాటలో ఒక ఆడపిల్ల పడుకో బెట్టబడివుందిట. ప్రక్కనే యేదో వుత్తరంకూడా వుందిట. శకుంతలమ్మ ఆ పసిబిడ్డను చేతుల్లోకి తీసికొని, వుత్తరం పమిటచెంగుకుకట్టి, ఆ గోతులన్నీ దాటి యింట్లోకి వచ్చేసి, తన మంచంమీద ఆ పసిబిడ్డను పడుకోబెట్టి, లాంతరు ముక్కాలిపీటమీద పెట్టి, తాను మంచం దగ్గరగా కూర్చొని ఆ వుత్తరం చదవడం మొదలు పెట్టిందట.

"నా బిడ్డ - యీ వుత్తరం దొరికినవారికి నమస్కారములు. చదువుకొన్నదాన్ని. కాని నా చదువు నా జీవితానికి నిరుపయోగమైంది. కన్న తల్లిదండ్రులులేని నా జీవితానికి సవతితల్లిపోరు యెక్కువయింది. నాకు యవ్వనం మితిమీరినా, నా బ్రతుక్కి సుఖం గలిగించాలనే వుద్దేశ్యం ఆమెకు లేకుండాపోయింది. ఎన్నిసార్లో రేగిన తియ్యని యవ్వన కోర్కెలను అణుచుకొంటూ వచ్చాను. నా పెళ్ళి గురించి ఎన్నిసార్లో స్వతంత్రించి సవతి తల్లిని అడిగిన రోజులున్నయి. కానీ అవన్నీ ఆమెను యేమాత్రం నా జీవిత సుఖానికి తోడ్పడేలాగు చేయలేకపోయినవి. నాలో కోర్కెలు రోజు రోజుకి, పరిపరి విధాలుగా విజృంభించినయి. ఎంత తమాయించుకొన్నా లాభంలేకపోయింది. చివరకు ఒక నాటి వెన్నెల రాత్రిలో నా యవ్వన జీవిత కుసుమం పరాయిగా తాత్కాలిక సౌఖ్యాఘ్రాణానికి ఒప్పగింతయిపోయింది. ఆ నాటినుండి మూడునెల్లు కమ్మని కళ్ళల్లో కలల కథలతో బ్రతుకు సాగించాను. నాకు తెలుసు యీ సుఖం తాత్కాలికమని. కాని తీర్చుకుంటున్నా. తరువాత భగవంతుడు నా కిచ్చిన ఫలితం మీకు దొరికిన యీ పసిబిడ్డే. నేను చేసింది తప్పని ప్రపంచం అనొచ్చు. కాని నాకు తప్పు కనిపించడంలేదు. పరిస్థితులవల్ల మారిపోయానుగాని, స్వతః సిద్ధంగా నేనీపనికి పూనుకోలేదు. యీ వుత్తరంచదివి నన్ను క్షమిస్తారో, తిట్టిపోస్తారో నేనెరుగను. మీరేమన్నాసరే పడతాను. మీ విమర్శలన్నీ తలదాలుస్తాను. యీ పనికి బాధ్యురాలను నేనే. మీ ముందు నేనుండను - మీకు కనిపించను. కాని మీ వెంట నేనుంటూ-నన్ను కనుకోలేరు. నా బిడ్డను నేను చూసుకొంటూనేవుంటా. నా బిడ్డ నన్ను 'అమ్మా'అని పల్కరిస్తూనే వుంటుంది. ఇది దాగని సత్యం. — ఇట్లు "........"

ఆ వుత్తరం పాపం ఆ పంతులమ్మ ఎన్నోసార్లు చదువుకొని తనలో తాను యేడ్చిందట.

క్రాంతీనాథ్ అంతా వింటూ మజ్జిగముద్ద పూర్తి చేసి, చేయికడుక్కొని అక్కడే కూర్చొని "ఊ..." కొడుతున్నాడు.

తెల్లవారిం తరువాత యీ విషయమంతా వూరిలో పొక్కిపోయిందట. అందరికీ ఆశ్చర్యంవేసిందట. తరువాత ఆ శకుంతలమ్మే ఆ పసిబిడ్డకు 'రాగవర్ధని' అని పేరు పెట్టుకుంది. తనకు పిల్లలు లేకపోవడం చేత అల్లారు ముద్దుగా పెంచుతూ, కడుపున పుట్టిన పిల్లలాగా తలుస్తూ, చూసుకోవడం మొదలెట్టింది. ఆ పంతులమ్మ దగ్గరే నేనూ చదువుకొంది. అప్పుడు నేను రాగవర్ధని ఒకళ్ళ పక్క నొకళ్లు కూర్చొని యెంతో ముచ్చటగా చదువుకొంటూ, అచ్చంగాయలాడుకొంటూ వుండేవాళ్ళం. అలా యింతవరకూ ఆ అమ్మాయిని పెంచుతూ, యేలోటురానీయకుండా కాపాడుతూ వస్తోంది. యిన్నాళ్ళబట్టి యిక్కడ వుంటున్నానని తెలియదట. యీ మధ్యే తెలిసిందట. యివ్వాళ వెతుక్కుంటూ వచ్చింది. చిన్ననాటి స్నేహితులంకాదుటండీ! ఆ స్నేహ ప్రేమ యెట్లాపోతుంది?" అంటూ సువర్చల రాగవర్ధని జీవిత గాథను సంగ్రహంగా చెప్పేటప్పటికి వసారాలో కూర్చొన్న 'రాగవర్ధని' తెల్లబోయి "నాకు అమ్మలేదా!" - మా అమ్మ చెడిపోయిన మనిషా! - నేను పాటిగోతులో దొరికానా! - మా అమ్మను యెవరో మోసంచేసారు! - నన్ను పెంచేది మా అమ్మ అక్కయ్యగాదూ! - యేమిటిదంతా! నా జీవితం చివరకు యిదా" అని అనేక విధాలుగా

ఆలోచనలు బయలుదేరాయి. వింత వింత మార్పులు తనలో వుద్భవించాయి.

క్రాంతీనాథ్ వంట యింట్లోంచి, మధ్య వసారా లోకివస్తూ - "మరి యీ విషయం యీ అమ్మాయికి తెలుసా" అని అడిగాడు సువర్చలని.

"తెలియదు" అందామె.

రాగవర్ధని వుత్తరవేపు గుమ్మంకి జారగిలబడి కూర్చొని కంటతడిపెట్టుకోవడం, - అన్నానికి లేవమని పిల్వడానికి వచ్చిన సువర్చలచూసి-ఆశ్చర్యపడి-

"వర్ధనీ! యేమిటే యింకా! చిన్నపిల్లలాగా. తే ... అయిందేదో అయిపోయింది. అనుకొంటే మాత్రం యేంలాభం. వూరుకో" అంటూండగా, - రాగవర్ధని 'అమ్మా' అంటూ బావురుమని యేడ్వటంలోగల మమకార స్వరూపం, సిగరెట్ కాలుస్తున్న క్రాంతీనాథ్ హృదయాన్ని కరగించివేసింది.

'అమ్మ' అన్న మాటలోగల తియ్యదనం - ఆ మార్దవం ఆ రస స్వరూపం యెవరూ యిదమిద్ధంగా చెప్పలేరు. "కన్నతల్లి యెవరో తెలియకుండా తన జీవితాన్ని యింత వరకూ గడుపుకొంటూ వస్తోంది-" అంటే ఒక చిత్రమైన సంగతేననిపించింది. ప్రపంచంలో 'తల్లి'ని మించిన దైవం వేరే లేదన్నారంటే వూరికే అన్నారా" అని అనిపించింది.

"అమ్మ" అన్న పదంలోగల మమకార నిజ స్వరూపాన్ని అలాగే పునః పునః మననం చేసుకొంటూంటే, రెండేళ్ళ క్రిందట స్వర్గస్థురాలైన తన తల్లి గుర్తుకొచ్చి, ఆ మూర్తి తన కళ్ళముందు లాస్యంతో, సునిసిత భావ్యంతో, మధుర మందహాసంతో కనిపించి "నాయనా! క్రాంతీ! కులాసా" అని పల్కరించినట్లు, తాను 'అమ్మా' అని సంభోదించినట్లు అనిపించి, అప్రయత్నంగా కళ్ళవెంట నీరు తిరిగి చెక్కిళ్ళమీదుగా జారుతూండగా భుజంమీదవున్న టర్కీటవల్‌తో వాటిని తుడుచుకొని, చేతిలో సిగరెట్ ఆఖరిసారి మెల్లిగాపీల్చి - దాన్ని అవతలపారేసి - వంట యింట్లోకి తొంగి చూసాడు.

సువర్చల, - రాగవర్ధనిని ఓదార్చుతోంది. కాని రాగవర్ధనికి అణుచుకొన్నా అణగనటువంటి, ఆపుకొన్నా ఆగనటువంటియేడ్పు తెర్లి తెర్లి వచ్చేస్తోంది.

సువర్చలకు ఆ సమయంలో అన్నంమీద ధ్యాస పోయింది. యేంతోచక రాగవర్ధన్ని ఓదారుస్తూ - యేవో మాటలు చెపుతూ వూరడింపుకోసం ప్రయత్నం చేస్తోంది.

"ప్రతి రోజూ వచ్చే సువర్చల యీ రోజెందుకు రాలేదా" అని భువనేశ్వరి చెప్పుల్లో కాళ్లు పెట్టింది. వీధి తలుపు తీసికొని సరాసరి లోపలికి వచ్చేసరికి, సువర్చల తను ప్రొద్దున చూసినమ్మాయిని ఓదార్చడం ఆశ్చర్యంగా కనిపించింది. అంతా అయోమయంగా తోచింది. "సువర్చలా! యేమిటి" అని ప్రశ్నించింది భువనేశ్వరి.

"ఆ! యేమీ లేదే! భువనా! తల్లి జ్ఞాపకం వచ్చింది అంతే ..." అంది ముక్తసరిగా అప్పుడు.

"తల్లిలేని పిల్లల్నిచూస్తే జాలిపడని హృదయం కఠిన పాషాణంకన్నా కర్కశం" భువనేశ్వరికి ఒక్కసారిగా జాలిపుట్టుకొచ్చింది. పరిచయంలేనివారిని పల్కరించాలంటే అదో రకంగా వుంటుంది. అదేమిటో అవ్యక్తం. యేదో ఒక సంఘటననో, సన్నివేశాన్నో, సందర్భాన్నో పురస్కరించుకొని పరిచయమైపోతాం. పరిచయంలేకపోయినా, పరిస్థితి అర్ధమైంది భువనేశ్వరికి. అందువల్ల పల్కరించినా బాగానే వుంటుందనుకొని దగ్గరగావచ్చి,—

"ఊరుకోమ్మా! యెవరు మాత్రం యేంచేయగలరు. ఏడిస్తేవస్తారా! అయిందేదో అయిపోయింది. వూరుకోమ్మా!" అంటూ ఓదార్చడం మొదలుపెట్టింది. సరిగ్గా ఆ రోజున సువర్చల — రాగవర్ధని యెంగిలి పడేటప్పటికి రెండు గంటల రైలు వెళ్లింది. రాగవర్ధన్ని తరువాత, తరువాత భువనేశ్వరికి పరిచయం చేసింది సువర్చల. ముగ్గురు చాలాసేపు యేవో కబుర్లు చెప్పుకున్నారు. ఒక అరగంట వుండి భువనేశ్వరి "వెడుతున్నానండి" అంటూ రాగవర్ధనికి, "వెడుతున్నానే" అని సువర్చలకు చెప్పి వెళ్లిపోయింది.

క్రాంతీనాథ్ వాకిటి వసారాలో పడక కుర్చీలో నిద్రపోతున్నాడు.

సువర్చల మాట్లాడుతూ, మాట్లాడుతూ నెమ్మదిగా రాగవర్ధన్ని పెళ్లి కబుర్లలోకి దించి — "ఇందాకేదో చెబుతానన్నావ్. చెప్పవులే!" అంది.

రాగవర్ధని ఆ మాట విన్న మరుక్షణంలోనే లేచి వెళ్లి టేబిల్ మీద వున్న చేతి సంచిని తెచ్చి, అందులోంచి ఒక ఫోటో తీసి - "యీయనగారెలావున్నారో చెప్పవే" అంటూ చేతికిచ్చింది.

సువర్చలకు ఆశ్చర్యం వేసింది. వెయ్యి మెరుపు తీగెలు తన కళ్లల్లో మెరిసినట్లయింది. యేమని చెప్పాలో తెలియక, కళ్లప్పగించి ఫోటోవంకే చూస్తూండి పోయింది.

రాగవర్ధనికి యెంతకీ జవాబు రాక పోయేటప్పటికి "ఏమే! బాగుండలేదా!" అంది.

"అదృష్టవంతురాలవే" అంది సువర్చల.

"ఏం" — అంది.

"యీయనెవరో తెలుసా!" అంది.

"ఆ!"

"ఎవరూ?"

"కాబోయే...మా..వా...రు." అంది రాగవర్ధని.

"అది అలావుంచు. మరోమాట, యీయన యిప్పుడు రాలా నా స్నేహితురాలు భువనేశ్వరి, ఆవిడిగారి అన్నగారు. 'రజనీ కాంతుడుగదూ' ... పేరు -" అంది.

"అవునూ..."ర...జ...నీ...కాం...తు...డే!"

"నీకు మనస్ఫూర్తిగా నచ్చారా? అంది సువర్చల

"నచ్చడమేమిటి: వారి హృదయానికి నేను, నా హృదయానికి వారు యిప్పటికి సంవత్సరం క్రిందే అంకితమైపోయాం. వారిప్పుడు హోటల్లో భోంచేస్తూ వేరేవుంటున్నారు. అప్పుడప్పుడు వెళ్లి యేంకావాలో కనుక్కొస్తూంటా. నన్ను చూడందే వారొక్కరోజూ వుండలేరు, నేనూ అంతే అయ్యానే. దీని మూలంగా నేనెక్కడికీ బయలు దేరడంకూడా మానేశాను." అంది రాగవర్ధని.

"అయితే, మీ, పెద్దమ్మ యేమంది?"

"అయితే యేమిటింకా. మా పెద్దమ్మ చాలా సంతోషపడింది యీ విషయం తెలిసినప్పుడు. నీ కిష్టమైన వాళ్లను చేసుకొంటానంటే కాదంటానా! పిచ్చితల్లీ! నువ్వు సుఖపడతాననడం కంటే, వేరే నాకేంకావాలి. భగవంతుడి దయవలన ఆ మూడు ముళ్లు పడి, ఒకయింటి వాళ్లను చేసి, యే పుణ్యతీర్థాలకో పోదామనివుంది" అని చెప్పిందన్నది రాగవర్ధని.

"మరి యీ విషయం వారి వాళ్లకు తెలుసా?"

"అది నాకెట్లా తెలును."

"ఆ చెప్పడం మరిచాను. నీరజనీ కాంతుడుగారు ప్రొద్దున్న వాళ్ల చెల్లెలింటికి వచ్చారు. యిందాక కూడా అక్కడే చూచాను. ఒకవేళ వున్నారేమో చూసిరానా? -" అంది సువర్చల.

"ఎందుకూ?" అంది రాగవర్ధని.

"నువ్వు మా యింటికివచ్చావని, మాట సామెతగా అనొస్తా"

"వద్దులెద్దూ! బాగుండదు."

"సరే నీ యిష్టం. వద్దంటూంటే నేను మాత్రం యెందుకు బలవంతంగా వెళ్లాలి. మరి యెలాగైనా యీ విషయం ఒకప్పటికైనా బయటపడి తీరాలిగా. యెన్నాళ్లని దాస్తాం" అంది సువర్చల.

కాసేపు యిలాగే సువర్చల - రాగవర్ధని కులాసాగా కబుర్లు చెప్పుకొంటూ, ఆ సాయంత్రం సినిమాకు పోదామని నిశ్చయంచేసుకొన్నారు.

## 5

"రజనీ కాంతుడు ఆ రాగవర్ధన్నితప్ప యింకెవ్వరినీ పెళ్లి చేసుకోడట"—,

"అదికాదే! రజనీ కాంతుడికి - రాగవర్ధనికి యిప్పటికి సంవత్సరంపైచిల్లునుంచి సంబంధం వుందిట"—,

"రాగవర్ధని ప్రతిరోజూ రజనీ కాంతుడింటికి వెళ్లి వస్తూండటం ప్రతివారూ యెరుగునట".,

"తనింట్లో యే పిండివంట చేసుకొన్నా రజనీ కాంతుడుకి పెట్టకుండా తినదట రాగవర్ధని".,

"ఒక సారి రజనీకాంతుడు - రాగవర్ధని కలిసి సినిమాకు వెళ్లడం మా బంధువులెవరో చూసి 'యిదేమిటి' అని ఆశ్చర్య పడ్డారట" .,

"రజనీ కాంతుడికి కట్నాలు - కానుకలంటే యిష్టంలేదట. తనకు నచ్చిన పిల్ల యీ లోకంలో రాగవర్ధని తప్ప యింకెవ్వరూ లేరట. దాన్ని తప్ప యింకెవ్వరనీ వాడు చేసుకోట్ట" —,

"ఇంట్లోంచి వేరు పడటానికి కూడా యిదే కారణం అని అంటున్నారు. ఎంతవరకూ నిజమో యెవరికి తెలుసు. యేదో అనుకుంటూండగా వింటమే గాని:—,

"ఆ అమ్మాయికి కూడా వాడిలాగా పట్టుదల వుందిట" అందుకనే కాబోలు యింత కాలానికి కూడా పెళ్లి చేసుకోలేదు",

"ఇదివరకటి మాదిరిగా రజనీకాంతుడు యే బంధువులింటికి రావడంలేదూ!"

ఇట్లా భువనేశ్వరి రజనీకాంతుని గురించి అక్కడక్కడ విన్న మాటలు బట్టి ఒక నిర్ధారణ కొచ్చింది. 'రజనీ కాంతుడు - రాగవర్ధన్ని తప్ప యింకెవ్వరినీ పెళ్ళి చేసుకోను' - అని మంకు పట్టు పట్టాడంటే తనకొక విధంగా సబబుగానే తోచింది యెందుకంటే పిల్లవిషయంలో తనకన్నీ నచ్చాయి. పిల్లకు యే విధంగానూ వంకలు లేవు. రూపరేఖ సౌందర్యాలన్నీ తగినట్లుగానే వున్నాయి. అన్నయ్యను చేసుకోబోయే అమ్మాయి యీమే అని, తనకు వదిన కాబోయే అమ్మాయి యీమే, అని తెలియక పూర్వం సువర్చల యింటివద్ద తనకు పరిచయం కాకముందే, తనే ముందుగా పల్కరించి, ఓ దార్చినప్పుడు, తరువాత, తరువాతకూడా చాలా ముచ్చటగా మాట్లాడింది. తన కప్పుడే అనిపించింది — "యిటువంటి అమ్మాయి తనకు వదినైతే యెంత బాగుండునని." కాని అనుకున్నవన్నీ జరుగుతాయా! అనే బెరుకుకూడ వుండటంవల్ల అది ఆట్టే కాలం హృదయంలో వుండలేకపోయింది. కాకపోతే కట్నాల విషయంలో వాడేమీ 'ఊ' అనడంలేదు. "నాకు కావాల్సింది రాగవర్ధని," అని అనడం తప్ప, వారేంకోరడంలేదు. యీ విషయంలో తన పుట్టింటివారు యెందుకు యేకీభవించడం లేదో తన కర్ధంగాకుండా వుంది. ఒక ఆదివారంనాడు తనింటికి పిల్చి, భోజనాలన్నీ అయిన తరువాత యీ ప్రస్తావనను ప్రసంగిస్తే ముచ్చటగా చెప్పిందికూడా యీ వొక్క ముక్కే. అటువంటప్పుడు వాడి క్షేమాన్ని కోరి మనం నడుచుకోవలసిన బాధ్యత, మనం తీసికొనేటట్లు వుండడానికి ప్రయత్నించాలి. ఎవరికి వారూరుకొంటే, వాడు స్వతంత్రించి పోవడానికి దారి చూపినట్లవుతుంది." అని తనలో తానేదో తర్జన భర్జన చేసుకొని, వున్న పాళాన యింటికి తాళంవేసి, తాళంచెవ్వు సువర్చలకిచ్చేసి, తల్లిదండ్రుల దగ్గరికి బయలుదేరింది. సరిగ్గా భువనేశ్వరి బయలు దేరేటప్పటికి సాయంత్రం నాలుగున్నర కావొస్తోంది.

(సశేషము)

# ఎప్పటికి మోక్షం?

శ్రీ వేదుల కామేశ్వరరావు

---

మానవుడు ఆవులించి చిటికేసిన మోస్తరుగా విశ్రాంతికోసం ఒళ్ళు విరుచుకొంటూ పదిగంటలు కొట్టింది గోడగడియారం. ఆఫీసుగది అంత నిశ్శబ్దంగావుంది. అందుకు కారణం అంతక్రితం ఆ ఆఫీసు గోడవగా వుండటమే. మేనేజరు లావుగా, పొడవుగా, పెద్దరాగిబిందంత బొజ్జ కప్పడానికి తొడుక్కొన్న బుష్‌కోటు, చేతిలో బెత్తమూ చూచి లేడిపిల్లలలాగ హడలిపోతూ గుమాస్తాలందరూ వాళ్ళ వాళ్ళ పనుల్లో నిమగ్నులైపోతున్నారు. బంట్రోతులు తలపాగాలు చుట్టి కాగితాలు త్రిప్పుతున్నారు. ఒకవైపున కుర్చీ, టేబిలూవున్నాయి. టేబిలుమీద ఫైల్సు కట్టలుగా కట్టి కుప్పలుగా పోయబడివున్నాయి. వాటిముందు నీరసంగా కూర్చొన్నాడు శేషాచలం. క్లర్కు పోస్టులో ప్రవేశించిన తరువాత ఎప్పుడూ పనిని గురించి విసుగు చెందేవాడు కాదు శేషాచలం. కాని ఈ నాడు తనికి ఆ ఫైల్సు చూస్తే కళ్లు తిరిగి పోతున్నాయి. కాగితాలు చూస్తుంటే బుర్ర వేడెక్కి పోతోంది. కాని, ఏంచేస్తాడు? తప్పదు.

లోపల్నుంచి వస్తున్న విచారాన్ని ఒక్కసారి అణచుకొన్నాడు. తనకు మంచి భార్య దొరకడంవల్ల జీవితంలో కొంతైనా మాధుర్యం కన్పించేది. కాని ఇప్పుడు అదీ లేదు. అవును. ఎలావుంటుంది? ఎంతమంచి హృదయమైనా ఇంటి పరిస్థితుల్ని చూస్తే ఆవేదన చెందదూ? భర్తయొక్క పరిస్థితి తెలుసుకొన్న భార్యకనుక, తాను కాపరానికి వచ్చిన పదేళ్ళనుంచీ ఎప్పుడూ "ఈ వస్తువు కావాలి" అని అడుగలేదు శాంత. ఉన్న దాంట్లోనే జాగ్రత్తగ సర్దుకోగలిగిన, ఆరితేరిన చేయి కనుక చలాన్ని సుఖపెట్టగలిగేది శాంత. ఇన్నాళ్ళకి. ఇప్పుడు పాల డబ్బా అయిపోయింది...ఇంట్లో కూరలేదు" అని అనగలిగింది శాంత దీనంగా. ఆ మాత్రం దానికే చలం హృదయం చివుక్కుమంది.

"ఇంకా జీతాలురాలేదు" అన్నాడు చలం ఇంకాదీనంగా.

"ఎక్కడైనా అప్పు తెచ్చుకోండి" అని వెళ్ళిపోయింది శాంత.

అసలు కూరలేకపోతే పప్పుపులుసు కాచి కాలక్షేపం చేసే శాంత ఈ నాడు కూరకోసం ప్రత్యేకంగా అడగటం మర్యాదకోసమే. సాగీ సాగని జీవితాలలో చుట్టాల బాధ వొకటి!

ఆలోచిస్తున్నాడు చలం. గడియారం తిరిగి పోతోంది. బంట్రోతు వచ్చి సంతకాల కోసం నిలబడ్డాడు. చలం సంతకం చేశాడు.

..."ఈ గుమాస్తాల జీవితాలు ఇంత అధోగతిలో ఉండటానికి కారణం ఏమిటి? పెళ్ళాం, పిల్లల్ని పోషించలేని ఉద్యోగం ఎందుకు? రచయితలందరూ గుమాస్తాల మీద వ్యాసాలుదంచినా గుమాస్తాల జీవితాలకు మార్పు లేదేం? గుమాస్తాల జీవితాలకు ఎప్పటికి మోక్షం?".. ఆలోచిస్తున్నాడు చలం.

"బియ్యం లేకపోతే ఫరవాలేదులెండి. కాస్త గంజి త్రాగుదాం"

"ఇదిగో, ఈ బంగారం అమ్మి సరుకులుకొని తెండి"

"నాకు చీరెలకు తొందరలేదు. మీకు పంచెలన్నీ చిరిగిపోయాయి. రెండు పంచెలు కొనుక్కోండి"

"నేను సినీమాకురాను, ఆ డబ్బులుంటే రేపు కూరైనా వస్తుంది"

...భార్య మాటలన్నీ చెవులలో ప్రతిధ్వనిస్తున్నాయి. కళ్లు మూసుకొన్నాడు. కాని చెవులు వూరుకొంటాయా? భార్యని మరొకసారి మెచ్చుకొన్నాడు. కాని ఏమి లాభం? ఇప్పటి కామెకొక్క చీరైనా తన చేతులతో కొనలేకపోయాడు. నాలుగేళ్ళక్రితం పెళ్ళిలో వచ్చిన చీరలలోవే రెండు మిగిలితే, వాటితోనే గడుపుతోంది. ఇదివరకొక చీరకొంటే కొట్లో తిరిగి ఇప్పించివేసింది. ఆమెస్థితి తల్చుకొని కన్నీళ్ళు కార్చాడు.

"ప్రపంచంలో ఎంతోమందివున్నారు. ఆగర్భ శ్రీమంతులైన వాళ్ళకు ఎప్పుడూ ఏమీ లోటులేదు. నిరుపేదల కసలు 'లేద' నే పదంకూడా లేదు, ఈ నిఈ గుమాస్తా వర్గానికి చెందిన వారికే ఈ పాట్లన్నీ. అటు మేనేజరు చూస్తే సిల్కు బుష్కోటు, ప్యూన్ చూస్తే తెగమాసిన నిక్కరు. తనుకూడా మేనేజరుతో సమానంగా వెయ్యాలి డ్రెస్సు. బజారులో కూరలు కొంటే కూలీకావాలి. తను మోస్తే ప్రపంచంనవ్వుతుంది. అవును ప్రపంచం నవ్వితే మనం మొయ్యడానికేం? ఎదురు ప్రశ్న వేసింది మనస్సు. అబ్బ పని మానేసి ఇదేంగొడవ? అనుకొంటూ పని ప్రారంభించాడు చలం.

ఇంతలోనే బంట్రోతు వెంకన్న ఒక కాగితం తెచ్చి ఇచ్చాడు. దానిమీద జీతాలు ఇంకారావనీ మేనేజరు వ్రాసిన కొంకి వ్రాత ఉంది.

"అద్దెయివ్వండి చలంగారూ! ప్రతీ నెలా ఇంత ఆలశ్యమైతే యిలాగు? ఇవ్వాళ ఇస్తానన్నారు. మర్యాదగలవాడివని ఊరుకొంటున్నా" — షావుకారు

"క్రిందటి నెలా, ఈనెలా కలిపి నల్భై రూపాయలయిందండి. గేదెను కొనుక్కోవాలని చెప్పానుగదండి. వారం రోజుల

నుంచి త్రిప్పుతున్నారు.'' పాలమనిషి.

''ఇప్పటికి సెల్లాళ్లు బట్టి అడుగుతున్నా. ఇంకా ఇవ్వలేదండి బాబుగోరూ. పేనోళ్ళం. మమ్మల్నిలా బాధపెడితే ఎల్లాగండీ? తెల్సినోళ్ళు'' — పుల్లలమనిషి.

''ఇప్పటికి అరువు చిల్లరవాడకం ఏభై రూపాయిలయింది. ఇప్పించండి''—కిరాణా మర్చెంట్.

''పాలడబ్బా, కూరగాయలూ తెప్పించారా'' అర్థాంగి.

...అందరూ ఆ కాగితంలో దూరి రణగోణ ధ్వని చేస్తున్నారు. ఎంతమందికని సమాధానం చెప్తాడు? ఏమని చెప్తాడు?

బంట్రోతు మళ్లీవచ్చి, ఏదో సంతకం చేయాలంటూ చెప్పి వెళ్ళాడు. చలం చూశాడు. అది ఆఫీస్ ఛక్కు. 100 రూపాయిలు తీసుకురావడానికి కాబోలు మేనేజరుపంపాడు. అది చూడగానే చలానికేదో ఆలోచనల పరంపర కలిగింది. గుటక వేశాడు. నోరూరుంది కాని లాభం లేదు. ''ఎప్పటికి మోక్షం?''అని మనస్సు ప్రశ్నించింది బాధగా. సాయంకాలంవరకూ ఆలోచించాడు. దారీ తెన్నూ కన్పించ లేదు. వెళ్ళి మేనేజరుని ప్రాధేయపడదామని లేచి నిలబడ్డాడు. ఇంతలో మేనేజరే వచ్చాడు తనవైపు.

''సార్!'' అన్నాడు చలం.

''ఏం?'' గర్జించాడు మేనేజరు.

''ఈ నెల ఇంట్లో......—''

''ఇంట్లోనూ లేదు; వంట్లోనూ లేదు. నీకేదో బుర్రలో ప్రవేశించింది. నీకు ఈ నాటినుండి ఇక్కడకు రావలసినపని తగ్గింది. నిన్ను డిస్మిస్ చేశాను.''

''అడిగినందుకే డిస్మిస్సా సార్!

''కాదు ఇదిగో ఛక్. దీనిమీద ''ఎప్పటికీ మోక్షం'' అని వ్రాశావు. ఇంకా ఏవో గీతలు పెట్టావు. నీ జీతం ఇందులో కట్ చేశాం వెళ్లు. రేపట్నుంచి నీవు రావద్దు'' అంటూ విసురుగా వెళ్ళి పోయాడు మేనేజర్. గుమాస్తాలందరూ కళ్లు వప్పజెప్పి చూస్తున్నారు. గుమ్మాలు దిగి బైట పడ్డాడు చలం.

..........షావుకారు, పాలవాడు, పుల్లలవాడు, కిరాణా మర్చంటూ, అర్థాంగీ, ...అందరూ చేతులు చాపుగు వస్తున్నారు వారిని గెంటుకొంటూ చలం ముందుకు వెడుతున్నాడు, ''ఎప్పటికి మోక్షం?'' అంటూ ప్రక్కనున్న పిల్లగాలులు చెవులలో దూరి పోరుతున్నాయి.

# తరిగొండ వేంగమాంబ శివవిలాసము

శ్రీ యస్వీ జోగారావు యం. ఏ.

వేంగమాంబ సుప్రసిద్ధాంధ్ర కవయిత్రి. ఉత్తమ విదుషి. కడప మండలమునందలి తరిగొండ గ్రామమీమె నివాసము. కాలము క్రీ. శ. 1840 ప్రాంతము. (చూ. శ్రీ వీరేశలింగంపంతులుగారి కవుల చరిత్ర - మూడవ భాగము.) తరిగొండ నరసింహస్వామియు, శేషాచలస్వామియు నీమె కిష్టదైవతములు. వారి కంకితముగా పలుకృతులు రచించినది. కాని యామె శివవిలాసము శివకథ కాబట్టి కాబోలు రాచవీటి వీరభద్రున కంకితము గావింపబడినది. కాని యందలి దరువులలో తరిగొండ హరిముద్ర తరచుగలదు. ఈమె కానాలవారి యాడుపడుచు. ఇంజేటి వారింటి కోడలైనట్లు గ్రంథాంతరములనుండి యెరుకపడుచున్నది. (చూ. చెంచునాటకము- మదరాసు అమెరికన్ డైమండుప్రెస్ ప్రచురణ, 1927; పారిజాతాపహరణము - (విష్ణుపారిజాతము)-ప్రా॥ లి॥ పు॥ భాం॥ ప్రతి ఆర్. నెం. 1056.) కాని యీమె తన నివాసమైన తరిగొండ పేరనే ప్రసిద్ధికెక్కినది. ఈమె పుట్టినింటివారు నందవరీక బ్రాహ్మణులు, వాసిష్ఠ గోత్రులు. ఈమె తండ్రి శేషార్యుడనియు, తల్లి మంగమాంబ యనియు శివవిలాసమున (ఆం॥ సా॥ ప॥ ప్రతి నెం. 2175 లో) గలదు. కాని యీమె తండ్రి కృష్ణార్యుడని పలుగ్రంథములందుగలదు. అసలు శివవిలాసమునందే అడయారు దివ్యజ్ఞాన సమాజమువారి ప్రతిలో మాత్రము కృష్ణార్యుడనియేకలదు. ఈమె తల్లిపేరు పలుగ్రంథములందు మంగమాంబయనియే వినబడుచున్నదికాని చెంచునాటకమున మాత్రము గంగమాంబయనికలదు. మంగమా కృష్ణార్యులే యీమె తలిదండ్రులని నా నమ్మకము.

ఈమె పలుకృతులు రచించినది. అందతిమాత్రమైన వైవిధ్యముగలదు. వానిలో యక్షగానములనేకముగలవు. అన్నియు కడుచక్కని రచనగలవి. అందు శివవిలాస మొకటి. ఇది యముద్రితము. దీని ప్రతులు రెండు అడయారు దివ్యజ్ఞాన సమాజ గ్రంథ భాండాగారమునగలవు. వాని అలమరా నెంబర్లు 32 ఇ 19, 32 ఎచ్ 8. ఆంధ్ర సాహిత్య పరిషత్తున 2175 లేక 2177 నెంబరుగల సమగ్రమైన ఏబది పుటల వ్రాత ప్రతియొకటి, నెం 1493/5 పత్రము లట్టకట్టుకొనిపోయి యెంచుటకు వలనుగాకున్న తాళపత్ర ప్రతియొకటి, నెం 1749 తాళపత్ర సంపుటిలో నొక ఎనిమిదాకులు - అకారాద్యముద్రిత గ్రంథ సూచికలో పొరబాటున వేంకటేశకల్యాణ మనుపేర పేర్కొనబడిన పై శివవిలాసమునందలి ఎరుక ఘట్టము మాత్రముగల ప్రతి యొకటియుగలవు. ఇందు ఆం॥ సా॥ ప॥ నెం 2175 ద ప్రతినిబట్టి యీ గ్రంథ స్వరూపమిట నిరూపింపబడును. (ఇది యింకను కేటలాగుల నైన వివరింపబడలేదు.)

ఈ గ్రంథమునకు కవయిత్రి పెట్టినపేరు శివవిలాసమని మాత్రమే. ఇందు పారిజాత ప్రసక్తియు రాదు కాని పారిజాత కథాసందర్భ సాదృశ్యము కొంత కారణముగా దీనికి శివపారిజాతమను వ్యవహారము గల్గినట్లున్నది. అందుచే నీమె రచించిన యసలు పారిజాతకథ కృష్ణనాయకము కాబట్టి విష్ణుపారిజాతమని వ్యవహరింపబడినది. (చూ. ప్రా॥ లి॥ పు॥ భాం॥ ప్రతి ఆర్. నెం. 1056) శివవిలాసపు పరిషత్ప్రతి నెం. 2175 చివర లేఖకుని మాటగా "౧౮౭౦ సంవత్సరం ఏప్రిల్ నెల తే ౧౬ దికి సరి అయిన విక్రమ నామ సంవత్సర చైత్ర శుద్ధ ౭ శుక్రవారంవరకు వంగిమళ్ళ గ్రామంలోవుండే తిరుమలసెట్టి వెంకట చిన్నయ్య భార్య అయిన తిమ్మక్కకు తిరుపతి మారెళ్ల సుబ్బన్న వ్రాసి యిచ్చిన శివపారిజాతము" అని యున్నది.

(ఈ మారెళ్ళ సుబ్బన్న సామాన్య లేఖకుడుగాడు. కవి. ఆరు పద్య కావ్యములు రచించినవాడు. వాని ప్రతులు పరిషత్తులోగలవు.)

గ్రంథారంభము:—

'శ్రీ గణాధిపతిని మహాత్ముని
యాగమ సంవేద్యుఁడైన హరుని భవానిన్
భోగీశ శయనుని లక్ష్మిని
బాగుగ పద్మజుని రాణిఁ బ్రస్తుతి సేతున్,'

తరువాత దరువులలో శివస్తుతి, మరల గణపతి స్తుతి.

'సలలిత శివవిలాసంబను కధయు
నలువంద యక్షగానంబు జేసెదను
ప్రాకటంబుగను నీ పరమాత్ము కరుణ
నీ కథా ప్రారంభ మేర్పరించెదను.'

కైలాసవర్ణనాదికమైన తరువాత పార్వతి శివుని వెదుకవచ్చుటతో, అనగా నదే ప్రథమపాత్ర ప్రవేశము, అసలు కథ యారంభమైనది. గంగమ్మ సంగతి నున్న శివుడు గౌరమ్మపై మరులుకొని గంగతో బొంకి గౌరిని వెదుకవచ్చును. ఇద్దరును తారసిల్లుదురు. పార్వతి సవతియింటనుండి వచ్చు శివుని వాలకము జూచి యనుమానపడును. అతడు సరసముగా సంజాయిషీ చెప్పుకొనును. ఇద్దరును రాజీపడి సుఖముండగా నారదుడొకనాడువచ్చి తాను గానముచే సూర్యుని మెప్పించి యతనివలన బహుమానముగా బడసిన రత్నాల హారమును గౌరీదేవి కర్పించును. తదుపరి గంగ శివుని వెదుకవచ్చినది. ప్రియునికడకు సందేశమంపినది. వెళ్ళిన చెలికత్తె పుల్లయవేమవరము చేసికొని వచ్చినది. గంగకు మార భూతము సోకినది. చెలులు శైత్యోపచారములుచేసిరి. మరల నొక చెలి శివునికడ కేగినది. మరల నిరాకరణము. గంగయే స్వయముగా బోవును. ఆమె కంతకుముందే రత్నహారము విషయము తెలిసినది. ప్రియునితో వాదన. అదియెల్ల ముడియక వచ్చినదారి బట్టినది. మారచంద్రమందా నిలురనింద యొకరేవు పెట్టినది. మరునాడు మగనిపై కోపమున సవతి మచ్చరమున జగద్వ్యాప్తముగు తన స్వరూపము నుపసంహరించినది. జలాభావముచే లోకములు ఘూర్ణిల్లినవి. అంతట లక్ష్మితో విష్ణువు "మన చిన్న జాహ్నవి మన ముద్దు బాల" పతిని బ్రతిఘటింప నిట్లు చేసినదని యామె నెఱుకత వేషము ధరించి గంగదరి కేగుమనును. లక్ష్మి కొరవంజియైనది. కొరవంజి శివునకు సవతులకు జిక్కులేకుండ నొక చమత్కారముచేసినది. 'ఆ రత్నహారంబు - అనగెంత పెద్ద,' బ్రహ్మదేవునికడ నొక మంచి మాణిక్యహారమున్నది, 'అది గావలెనటంచు నడుగుమీవతని' అని గంగకు సలహా చెప్పినది. విష్ణుమూర్తి యంతలో సింగిడైవచ్చును. సింగసింగళ్ళ ప్రసంగము. "

తదుపరి దేవేంద్రాదులు జలాభావమునకు బెగ్గడిల్లి శివుని బ్రార్థింపబోదురు. శివుడు పార్వతి వలదనుచున్నను గంగకడకు బయలుదేరును. ఆమె సత్యభామ వాలకము వేసినది. కాని యామె ధర్మమాయని మగనిదన్న లేదు. బ్రహ్మగారి హారము మాత్రము తెమ్మన్నది. అదెంతసేపు. అట్టే వచ్చినది. గంగ ప్రసన్నయైనది. పార్వతి పతివిరహము భరింపజాలక సవతి యింటికి బయలుదేరినది. ఆమె చెలికత్తెను గంగతో ఏ రేగగొట్టినది. తన చెలికత్తెకైన పరాభవమున కది మితిమీరిన ప్రతీకారము.

'మాట మరువకె జాహ్నవీ।
నన్నేమి చేసేవె శాంభవీ॥
అయితే తెలిసె లేవె జాహ్నవీ।
మంచిదైనంతా కానియ్యవె శాంభవీ॥

అని సవతుల సంవాదము. శివుడెట్లో యిరువురిని సమాధానపరచును. వారికి మరల పెండ్లి వేడుకలను భవింపవలెనను సరదా పుట్టినది - సువ్వాలలు, శోభనము, మంగళహారతి.

గ్రంథాంతము:—

"అని యిట్లు లోకలోకాధీశు పేర
ఫణిభూషణుని పేర పార్వతి పేర
జలజాత దళనేత్రి జాహ్నవి పేర
లలిమీరగాను సలక్షణంబుగను
విలసితముగ రాచవీటిపురమున
నెలకొని భక్తుల నేలిన యట్టి
విమల సాహసుడైన వీరభద్రునకు
సలలితమైనట్టి సద్భక్తితోను
వలనొప్పఁగా నందవరకులోద్భవుఁడు
వరకీర్తికానాల వంశవర్ధనుఁడు
గురుతరవాసిష్ఠ గోత్ర పావనుఁడు
వసుధమీఁదను గీర్తివంతుఁడైనట్టి
రసికుఁడు శేషార్య రమణి మంగాంబ
వరపుత్రి వెంగమాంబ ధరిత్రిమీఁద
అరుదుగా తరిగొండ హరికటాక్షమున
సరసత శివవిలాసంబను కథను
గరమర్థితో యక్షగానంబు జేసి
పరమభక్తిని వీరభద్రునికొసఁగె
ధరలోన నా చంద్ర తారార్కముగను."

రచన:-ఇందు తాళప్రధానములైన దరువు లెక్కువ. త్రిపుట, జంపె, కులుచజంపె, అట, ఆదితాళము లుపయోగింపబడినవి. ఆహిరి, నీలాంబరి, ఘంటారవ, మారువ, పంతువరాళి మొదలగు రాగములు నుపయోగింపబడినవి. రాగతాళములు రెండును నిరూపింపబడని దరువులును జాలగలవు. ద్విపద లెక్కువగా నుపయోగింపబడినవి. వచనములు తరుచు. జాత్యుపజాతి వృత్తములు, సీసార్ధములు, తలంపుల పాట, వాద ప్రతివాద దరువులు, యాలలు, సువ్వి పాట, శోభనము, మంగళహారతియుగలవు. వేంగమాంబకు యక్షగాన లక్ష్యలక్షణ పరిజ్ఞాన మెక్కువగా నున్నట్లు తోచును. అసలామె నాటికి యక్షగానము ప్రచుర ప్రచారముగాంచిన సాహిత్యప్రక్రియ. వెంగమ శైలి సరళముగా చక్కగా నున్నది. సలక్షణమైన భాషలోనే వ్రాయుటకు ప్రయత్నించినది, కాని కొన్ని అపప్రయోగములు దొరలినవి. అందెక్కువ వైరిపదములే. అవియు ప్రసిద్ధములుగావు.

ఉదా:-ఉన్నత చప్పరంబులు, శైలపట్టి, అత్యంత పంతము, కుసుకుబంతి, అతిపగ, నానాచూపులవాడు.

మరికొన్ని దోషములు:-యతిఘటితముగా కీర్తివంతుడనియు, కోయిల లేక కోకిలకు బర్యాయముగా కోవెల శబ్దమును ప్రయుక్తములైనవి. కొలది సంధి దోషములునుగలవు. ఈ గ్రంథ మీమె కవితా యాత్రలో తొలి మజిలీ కావచ్చును.

ఎరుక ఘట్టము, సవతికయ్యము యక్షగాన ప్రత్యేకతలలో ముఖ్యములైనవి. ఆ రెండును నిందుగలవు- సుదీర్ఘముగా. సింగిసింగళ్ళ ప్రసంగము కడురక్తి గట్టినది. వాని వాలకము - 'గుదిబడు కాళ్లు, కుంటిన వ్రేళ్లు, ఊచపిఱుదులు, తుంటచేతులు, బొక్కిబొమ్మ, సొట్టమెడ, కొక్కిరిబిక్కిరి కోరమీసములు, బాకినోరు, బవిరిగడ్డము, బిరుగురోమములు, బొంగ్రముక్కు, పెద్దపులిమొగము, ఎఱ్ఱటి కన్నులు, ఏనుగు చెవులు, చిట్టి వెంట్రుకలు' వగైరాతో 'సింగిసింగియనుకొంట। చికిలి నవ్వులు నవ్వుకొంట... లొల్లాసుద్యాలు జేసుకొంట। జోల్లుగార్చుకొంట. గిలుకాలల్లాడుకుంటా...' వచ్చినాడు. వర్ణన జుగుప్సావహముగ నున్నది. కాని యది సింగని నైజము. వర్ణ్య మెంత జుగుప్సావహముగ నున్నను స్వభావోక్తి యొక అలంకారము. బీభత్సము నొక రస మే.

సింగిసింగళ్ల ప్రసంగము:-ఉదా॥ దరువు -'ఆదితాళము.

సింగి॥ 'ఆడా యిన్నెడ యింగేవాడా। సింగా
గుడిసా విడిచీ యేలా వస్తివిరా।
వెట్టిసింగా॥

సింగడు॥ గుడిసాలోకి ఎలుకవచ్చె కలికి
సింగి। నేనూ
జడిసి నీతో చెప్పవస్తి జాణసింగి॥'

ఈలాగున పాత్రోచితముగా సాగును. ఎరుక ఘట్టము చిత్రించుటలో వేంగమాంబకు ప్రీతియు నేర్పును మిక్కిలి. తన గ్రంథములందు పలుతావుల వర్ణించినది. ఎరుకవారి సామె బాగుగా నెరిగినట్లున్నది. ఆమె సవతి మచ్చర మనుభవించి యెరుగునో ఎరుగదో కాని యది వర్ణించుపట్టునను స్త్రీ ప్రకృతి నతిమాత్ర మనోజ్ఞముగా చిత్రించినది. వేగము వెలుగు చూడవలసిన యక్షగాన కృతులలో నిదియు నొకటియని చెప్పవలె. స్త్రీ జనోద్ధరణ బద్ధకంకణములగు సంస్థలైన సిద్ధపడి యీ పుణ్యము గట్టుకొనునుగాక.

---

# అతఁడు - నేను

"కవిచంద్రులు" శ్రీ కోట సోదరకవులు

ఆతఁడంబుదమైన – నేనగుదు మెఱపు
అతఁడు సంగీతమైన – నేనగుదు స్వరము.
అతఁడు కవియైన – నేనునగుదురసము.
అతఁడు మకరందమైన – నేనగుదు తీపి,
అతఁడు కోయిలయైన - నేనగుదుపాట.
అతఁడు ఝరియైన - నగుదు నేనమృతధార,
అతఁడె హృదియైన - భావంబునగుదు నేను,

అతఁడు తనువైన – నేనింకనసువునగుదు.
అతఁడు మురళియమైన – నేనగుదుగీతి.
అతఁడు కనుచూపులైన – నేనగుదుపాప,
అతఁడు లేఖకుఁడైన - నేనగుదుకలము.
అతఁడు గోపాలుఁడైన – నేనగుదురాధ,
అతఁడె నేనౌడు – నేననునతఁడెయగుదు.

---

# రచనల దొంగతనం

శ్రీ దాసరి వేంకటకృష్ణయ్య

[కొందరు 'రచయితలు' నిర్భయంగా యితరుల రచనలను కాపీకొట్టి తమ పేరున ప్రకటించుకొంటున్నారు. అట్లాంటి వారి కోసమే ఈ రచన – చదవండి]

రచన అనేది ప్రజలు చదువుకొని అందలి సంగతులు గ్రహించుటవరకేగాని, దాన్ని తమ స్వంతమని ప్రకటించుకొనటానికిగాదు. ఇప్పుడిప్పుడు కొందరు 'రచయితలు' మక్కికి మక్కికాపీకొట్టి తమ పేరున షురానా రచయితలుగా యితర పత్రికలకు పంపుతున్నారు. ఇట్లాంటివారిని షురానా రచయితలనేకంటే 'షురానా దొంగ'లంటేనే బావుంటుందేమో! సాధారణంగా పత్రికా సంపాదకులంతా వెలువడుతున్న సమకాల పత్రికలన్నీ పరిశీలిస్తూనే వుంటుంటారు. ఇటీవల కొందరు యితరుల రచనలను తమ పేరున ప్రకటించుకొనుట సహజమయ్యింది. "ఆంధ్రపత్రిక" (వారపత్రిక) పిల్లలదసరా సంచిక (1-10-52) లో 'బాపూజీ' అనే పేరుతో కొన్ని పద్యాలు ప్రకటితమయ్యాయి. దాని రచయిత ఆర్. రేచల్ (14 సం॥) బెజవాడ అనివుంది. కాని, ఆ పద్యాలు నా మిత్రుడు వ్రాసిన 'ఆవేదన' అనే ఖండకావ్యమునుండి తస్కరింపబడినవి. ఆపద్యాలు పత్రికలో చూట్టం తటస్థించి సంపాదకులకు తెలియజేయటం- దాన్ని తరువాత సవరించటం జరిగింది. ఇదే కాకుండా 1948 సం॥ జనవరి "చందమామ"లో ప్రకటితమైన ఏటుకూరి వేంకట నరసయ్యగారి 'సంక్రాంతి' గేయాలు "ఆంధ్రప్రభ" వార పత్రిక ప్రమదల ప్రత్యేక సంచికలో 'సంక్రాంతి'

పాట' అనే పేరున అచ్చయింది. దాని రచయిత శ్రీమతి వేదాంతం రామలక్ష్మి అని వుంది!! ఇటీవల జరిగిన ఒక సంఘటన. నేను మా బంధువుల పెళ్లికి తెనాలిలో పద్యాలు వ్రాయడం, సుప్రసిద్ధనటులు బి. వి. బ్రహ్మయ్యనాయుడు వాటిని పాడటం జరిగింది. ఆ పద్యాల్ని కాపీకొట్టాడు ఒక ప్రబుద్ధుడు! ఇట్లా 'జాడ్యం' పెరిగిపోయింది.

స్వయంగా ఆలోచనాశక్తి, రచనా పాటవం లేక ఈ విధమైన గ్రంథ చౌర్యానికి పాల్పడుతున్నారు. దీనివల్ల వారికి తమ పేరును అచ్చులో చూచుకొనుట తప్ప వేరేమియు లాభముండదు; తరువాత అందరూ హేళనచేయటం.

పత్రికలలో ప్రచురింపబడే రచనలన్నింటికి కాపీరైటు వుండేట్లుచేయాలని పత్రికాధిపతులను కోరుతున్నాను. ఈ విధంగా చేయుటవల్ల "దొంగ రచయితలు" తయారవకుండా వుంటారు. విదేశాల్నించి వెలువడుతున్న పత్రికలన్నీ కాపీరైటు చేస్తున్నారన్న సంగతి అందరికీ విదితమే. గ్రంథచౌర్యం, రచనల చౌర్యం సిగ్గుచేటను విషయము గుర్తించేమంచిది!

—— (౦) ——

# తీరని కోరిక

శ్రీ ఆమంచర్ల మల్లికార్జునరావు

సిటీలో ఆ వీధి చాలా జనసమర్ధమైంది. ఆ వీధి మొగలోవున్న కిళ్ళీకొట్టువద్ద కారాపి, ఇవతలకువచ్చి కొట్టులో సిగిరెట్ ప్యాకెట్ కొంటున్న శేఖర్‌కు ఆమె కనుపించింది. ఆమె అప్పుడేవచ్చి వెళ్ళిన బస్సు నుండిదిగి తిన్నగా ఎదురుసందులోనికి మలుపుతిరిగి వెడుతూంటే అతను వెళ్ళి ఎదురుగా నిలిచాడు. శేఖర్ని చూచి ఆమె "అరే! మీరా?" అని ఆశ్చర్య పడుతూ నిలబడిపోయింది.

"నీవా" అన్నాడు అతను.

కొంచంసేపు మౌనంగా యిద్దరు గడిపినా మౌనాన్ని తొలగిస్తూ కడకు అతనే ప్రసంగాన్ని మొదలు పెట్టాడు.

"మళ్ళీ చాలా దినాలకు కలుసుకున్నాం గాయిత్రి! అన్నాడు శేఖర్.

"ఎప్పుడో ఒకప్పుడు ఈ జీవితంలో మళ్ళీ కలుసు కోక తప్పదులెండి" అంది ఆమె.

అతని చూపులు ఎదుటివ్యక్తిపై ప్రసారించబడి, ఎదుటి వ్యక్తిని పరీక్షించాయి - ఆమె వేసుకొన్న దుస్తులను పరీక్షగా చూచాడు - ఆమె తెల్లటిచీర ధరించివుండి ఒకేవక జతగాజులు చేతికివేసుకొనివుంది. చంకలో ఎక్సర్‌సైజ్ నోట్‌బుక్సు కట్టొకటి, చేతిలో పైఁమరి హిస్టరీ టెక్ట్సుబుక్‌ వుంది. ఆమె అంద చందాలు, ఉత్సాహం, ఆమెలో లోపించినట్లు ఆమె ముఖవర్చస్సు తెలుపుతున్నాది. పూర్వపు పోలిక లేమాత్రం ఆ వ్యక్తిలో లేవని, పోలికకట్టడం కష్టమని ఊహించాడు శేఖర్.

అతని చూపులకు ప్రత్యామ్నాయంగా గాయిత్రి అతని హోదాను యిట్టె ఒక క్షణంలో గ్రహించింది. అతను విలువైన సూటూ, బూటుతో వుండడమే గాక, చేతికి రెండు వుంగరాలు ధరించి వుండడం గమనించింది. ఆ వుంగరాలలో ఒకటి ఎరుపు, మరి యొకటి నీలం. అతనికొరకై ఎదురు చూస్తున్న కారునుకూడా చూచింది.

మళ్ళీ అతనే ప్రశ్నించాడు.

"ఇలా ఎక్కడికి వెడుతున్నావు? ఈ సరంజాం ఏమిటి అన్నాడు శేఖర్.

"స్కూలికి! యిక్కడికి దాపులోవున్న శారదా గర్ల్స్ స్కూలికి. పిల్లలికి చదువుచెబుతూ టీచర్‌గా వున్నా! మరి నీవిలా ఎక్కడనుంచి? ఎక్కడ ఆఫీసరుగా వున్నావు" అని ఏక వచన ప్రయోగంతో అంది గాయిత్రి.

"అలాంటిదేమి లేదు. ఇన్సూరెన్సు ఆఫీసులో వున్నాను. మనకు పెద్ద హోదాగల వుద్యోగాలేలా వస్తాయి" అన్నాడు.

"మనకంటారే! మీకేం మంచి ఆఫీసర్‌గా వున్నా వనుకొంటాను" అంది గాయిత్రి.

"అదిలేదు! ఏదో యింత హోదాగల కొంచం పెద్దది అంత మాత్రం" అన్నాడు శేఖర్.

కొంచంసేపు ఆగి ఆలోచించి, వున్నట్లుండి అడిగింది గాయిత్రి. "మీరు వివాహం చేసుకొన్నా రటగా? ఆమె మాటలు అతనిలో తొట్రుపాటు కలిగించాయి. తొట్రుపాటును కప్పిపుచ్చుకొంటూ చిరునవ్వునవ్వి "ఛా! అంతా అబద్ధమే! అందులో ఒక్క అక్షరమైన నిజంలేదు. పెండ్లిచేసుకోడానికి తీరికేది" అన్నాడు. అతను ఆమె ముందు నిలిచి చెప్పిన ఆ మాటల్లో అక్షరమైనా నిజమైందికాదు. ఆమె అడిగిన ప్రతి విషయంలో అతను ఓటమి నొందాడు.

"నేను అలాగని విన్నానులెండి" అంది గాయిత్రి.

"నేనూ విన్నాను! నిన్నుగూర్చి; నీవు వివాహం చేసుకొన్నావని. కాని ఇప్పుడు నిన్నుచూస్తే నిజం తెలుస్తున్నాది" అన్నాడు శేఖర్.

"దానికేంలేండి! యీలాంటి మాటలు ఎన్ని వినుంటానో. ఇక క్షమించండి. ఇక నేను వెళ్తా స్తాను! నమస్కారం" అని శేఖర్‌కు నమస్కరించి అక్కడినుంచి వెళ్లిపోడానికి ఉద్యుక్తురాలైంది. శేఖర్ ఆశ్చర్యపడుతూ ఆమె దారికి అడ్డుగా తన చెయ్యిజాపి అడ్డుపెట్టి "కనుపించక, కనుపించక అగుపించావు. సావకాశంగా అన్ని విషయాలు మాట్లాడక, తుర్రున పారిపోతే ఏలా! పద! కనుపించే హోటల్లో కూర్చుని చల్లగా కబుర్లు చెప్పుకోందాము" అన్నాడు శేఖర్.

"అలాగయితే స్కూలికి లేట్ అవుతుందే. యిప్పటికే బెల్ అయివుంటుంది" అంది ఆమె.

"అందులో వచ్చే ప్రమాదమేమీ లేదు. ఈ రోజుకు స్కూలుకు లీవు పెట్టు. సరిపోతుంది" అన్నాడు.

ఆమెకు అతని మాటలు నచ్చలేదు! అందుకు అంగీకరించలేదు. దానికి కారణం ఆ రోజు స్కూల్లో జీతాలిచ్చేరోజు - పర్వదినం - వచ్చే నాలుగురాళ్లు చేతుల్లోపడేరోజు. ఆ విషయం చెప్పి, అందుకోరకు అతన్ని అడుక్కోని తప్పించుకోవడం ఆమెకు ఇష్టం లేకపోయింది.

"శేఖర్‌గారు! ఇలా నడిరోడ్డుమీద నిలబడి మాట్లాడుకోవడం సభ్యతగాదు. రేపు సాయంత్రం మా యింటికిరండి! సావధానంగా మాట్లాడుకో వచ్చు" అంది గాయిత్రి.

"నీవు చెప్పిందే బాగుంది" అని ఆమోదించాడు శేఖర్.

చిన్న తెల్లకాగితంపై తన అడ్రస్ వ్రాసియిచ్చి "మీరు రేపురండి! మీరు బస్సు నెం... "అని ఏవిధంగా రావలసింది చెప్పబోయేసరికి.

"సరే, సరే! యిక వివరించనక్కరలేదులే" అన్నాడు అతను.

శేఖర్‌వద్ద శలవుతీసుకొని స్కూలువైపు వడివడిగా నడిచివెళ్ళిపోయింది ఆమె.

ఆ వెళ్ళిన దిక్కునేచూస్తూ వుండిపోయాడు శేఖర్, దూడని లాక్కుపోతుంటే చూచేగోవులాగా.

కార్ని కేకేసి, అందులో ఆఫీసు చేరుకున్నాడు.

ఆ వూర్లో మంచి పలుకుబడివుంది, ఆఫీసర్ హోదాలో జీవిస్తున్నవాడీ శేఖర్. కారు, హోదా గలిగివున్నా, తనకు వున్నవని తెలిపితే గాయిత్రి హృదయానికి నొప్పి కలిగించినవాడ నవుతానని ఆలోచించి ఆమె ముందు ప్రతి విషయంలో బొంకాడు. కాని అన్నింటిలో ఓడిపోయాడు.

ఆఫీసుకువచ్చి తన సీటులో కూర్చున్న శేఖర్‌కు తన కిటికీగుండా కనుపించే ఎర్రగోడల, మింటినంటే భవనాన్ని చూసేసరికి యెనిమిదేళ్ల క్రితం జరిగిన సంఘటనలు మెదడులో మెదిలాయి.

◆ ◆ ◆

అది యెనిమిది సంవత్సరాల క్రిందటిమాట. అప్పటికి శేఖర్ కాలేజి చదువుతున్న దినాలు - వాళ్ళ నాన్న అక్కడే పెద్ద ఉద్యోగం చేస్తుండేవాడు. శేఖర్ మంచి రూపసి - సహజంగా పుట్టుకతోనే వచ్చింది. కాని మనిషికి ఏదో అవలక్షణం వుంటుం దనే సిద్ధాంతానికి ఋజువుగా అతనికి పుట్టుకతోనే పిరికితనమొచ్చింది. ఆ పిరికితనం యిక తగ్గనేలేదు.

ఆ రోజు శేఖర్‌వాళ్ళింటికి, వాళ్ళ పెద్దమ్మ కుమారుడొచ్చాడు. అతనూ అక్కడే ఉద్యోగం చేస్తున్నవాడే. అతనికి ఆ మధ్య వివాహం జరిగింది. ఆ వివాహానికి శేఖర్ వెళ్ళకపోవటం జరిగింది. శేఖర్ని వెంటబెట్టుకొని పోవాలనివచ్చి, తన వెంట తీసుకొని వాళ్ళింటికి బయలుదేరాడు. బజారులోనుంచి నడుస్తూ, అక్కడినుంచి కొంతదూరం తీసుకొనివెళ్ళి "ఆరే శేఖర్! యీ యింట్లోవాళ్లను తెలుసట్రా నీకు" అన్నాడు.

"చాలా బాగుంది! ఈ పట్నంలోవుండే వాళ్లందర్ని తెలుసుకోడానికి ఓపికలేదురా అన్నా" అన్నాడు శేఖర్.

"అదిగాదురా! వాళ్లు మీ వదినకు చాలా దగ్గర బంధువులు - వరసకు పెద్దనాన్న అవుతాడు.

ఈ గృహస్థుడు" అన్నాడు వాళ్ళన్న.

ఎఱ్ఱటి రంగపూత వేయబడి, ముందు మంచి గార్డన్ వుండే ఆ మేడను ప్రతినిత్యం చూచేదే. అంత వరకు ఫలానివారిదనిమట్టుకు తెలియదు శేఖరికి.

శేఖర్ వద్దంటున్నా, బలవంతంగా ఆ యింట్లోకి దారితీసాడు శేఖర్ అన్న. స్వతహాగా శేఖర్ పిరికి-అందులో పదిమంది నూతనులు ముందు కూర్చుని మాట్లాడానికి ఆడవాళ్లకన్నా హైరానాపడతాడు.

యిద్దరూ ఇంట్లోకి ప్రవేసించేసరికి ఆ కుటుంబం సావధానంగా కుర్చీలో కూర్చుని అప్పుడే టీ తీసుకొంటున్నారు. శేఖర్ అన్ననుచూచి ఆ యింటి యిల్లాలు 'రావోయి! అల్లుడూ' అని ఆహ్వానించింది.

వెళ్లి ఆసనం ఆక్రమించి కూర్చున్న శేఖర్ దృష్టి నలువైపులా ప్రసరించింది. మంచి మర్యాద కుటుంబీకులలోవుండే లక్షణాలు కనుపించాయి. అతని చూపులు ఒక ప్రదేశానికి వచ్చేసరికి - అలాగే ఆగిపోయాయి - కంటికి ఎదురుగావుండే వ్యక్తిపై నిలిచి పోయాయి. తానావిధంగా చూడకూడదని అతనికి తోచలేదు - అతనికి ఆమె కనుపించింది. చేతిలోనికి టీ, సాసర్ తీసుకొని అప్పుడే టీ చప్పరిస్తూ, వచ్చిన వారికేసి చూస్తూవుండే ఆమె కనుపించింది.

ఆమె అందం, చందం, కట్టు బొట్టు అతన్ని అట్టే ఆకర్షించింది. మంచి వాయిల్ చీరకుతగ్గ జాకెట్, రెండు జడలు, ఒకచేతికి వాచీతో, రతీదేవిలా కూర్చునివుంది ఆమె.

గుటకలువేస్తూ కన్నార్పక చూస్తూ వుండిపోయాడు శేఖర్.

శేఖర్ని ఆ ఇంటి యజమానికి పరిచయం చేసాడు వాళ్లన్న.

"ఓహో! రామారావు కుమారుడా? చాలా సంతోషం" అన్నాడు ముక్తసరిగా ఆయన. ఆయన స్వభావం వెయ్యి మాటలు మాట్లాడినా, ముక్తసరిగా మూడు మాటలు మాట్లాడడం. ఇంటి యిల్లాలు మట్టుకు "అమ్మాయి గాయిత్రి! లోపలికి వెళ్ళి బావలకు టీ తీసుకొచ్చి ఇవ్వమ్మా" అంది కుర్చీలో రతీదేవిలాగా కూర్చున్న ఆమెనుద్దేశిస్తూ.

వయ్యారంగాలేచి, గాయిత్రి లోపలికివెళ్ళి రెండు కప్పుల్తో టీ తెచ్చిపెట్టింది.

ఈ నవనాగరకత ప్రపంచంలో ఎంత నాగరకత పెరిగినా ఎవరి అలవాట్లు వాళ్ళవి. కాలేజీ చదువుతున్న శేఖరికి కాఫీ, టీ మొదలైనవి అలవాటు లేదంటే అందులో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు.

శేఖర్ మట్టుకు తెచ్చిపెట్టిన టీ పుచ్చుకోక మిన్నకుండా కూర్చున్నాడు.

"ఏంనాయనా! టీ తీసుకోలేదే" అంది యింటి యిల్లాలు లక్ష్మమ్మ.

"వాళ్ల నాన్నగారి వుత్తరువేమో! యీలాంటివి తీసుకోగూడదని పాపం" అంటూ అదో మాదిరిగా అంది గాయిత్రి. ఆమె మాటలకు అందరూ నవ్వుకున్నారు. గాయిత్రి హేళన చేసిందనే ఉక్రోషం కొద్దీ యిష్టంలేకున్నా పౌరుషంకొద్దీ శేఖర్ చప్పున టీ కప్పు తీసుకొని ఒక్క గుటక మింగాడు. ఇంకేముంది నోరు కాస్తా కాలేసరికి చేతిలోని కప్పు సాసర్ విడిచేసాడు. అది కాస్తా గచ్చుపైపడి తుత్తునియలైపోయింది. ఆ దృశ్యం చూసిన గాయిత్రికి ఎంత ప్రయత్నించినా నవ్వు నిలపలేకుండా వచ్చింది. నోటికి పమిటిచెంగు అడ్డుపెట్టుకొని రూంలోనికి పరుగెత్తింది. రూం కర్టన్ వెనుక పకపకలు అక్కడవారికి వినిపిస్తూనే వున్నాయి.

లక్ష్మమ్మ నొచ్చుకుంటూ "జరిగిపోయింది పోనీలే! గాయిత్రి యిలారా! నవ్వు చాలించి కప్పుతో పాలు తెచ్చిపెట్టు" అని మందలించింది ఆమె కుమార్తెను.

"చిన్నపిల్ల ఏంతెలియదు" - బొత్తిగా వేగలేకండావున్నా దాంతో" అంటూ కుమార్తె ప్రవర్తనకు నొచ్చుకోకుండా సర్దిపుచ్చి చెప్పింది.

పదినిమిషాలు కూర్చుని శలవు తీసుకొని ఇవతల పడ్డారు యిద్దరు.

♦ ♦ ♦

శేఖర్ మళ్లీ ఆ యింటి పరిసర ప్రాంతానికి అడుగు పెట్టి ఎరుగడు. మళ్లీ వెళ్ళాలని తోచలేదు ఎప్పుడూను!

ఆ రోజు శేఖర్ కాలేజీనుంచి లంచిటైంలో యింటికి తిరిగి వెడుతూంటే తోటి విద్యార్థినులతో ఎదురుగా వస్తున్న గాయిత్రి కనిపించింది. గాయిత్రి ఆగి, శేఖర్ వద్దకువచ్చి "నమస్కారం! మా ఇల్లే మరిచిపోయినట్లున్నారే! మళ్ళీ అటువైపు రాలేదేం మీరు! ఆ దినంనాటి నా ప్రవర్తనకి క్షమించండి" అని క్షమాపణ కోరింది.

"క్షమించడానికి ఏంవుందిలెండి! తీరికలేక రాలేదు" అన్నాడు శేఖర్.

"నేనూ అలాగనుకున్నానులెండి! మరి యివాళ సాయంత్రం వస్తారుకదూ! రండి" అంది ఆమె.

ఆడవాళ్ళతో మాట్లాడడం చేతగాని శేఖర్ ఆమె అడిగిన కోరికను మనస్సులో యిష్టంలేకపోయినా నాగస్వరానికి ముగ్ధురాలైన నాగంలాగా "అలాగే వస్తానులెండి" అన్నాడు.



సాయంత్రం వాళ్లింటికి వెళ్లిన శేఖర్ని గాయిత్రి నాన్న సాధారణంగా ఆహ్వానించాడు. "ఆ రోజు జరిగిన సంగతి మరిచిపో నాయనా! మేము భయపడ్డాం—మళ్ళీ ఈ యింటికి రావేమో" అని పలికాడు ఆయన.

"అలాంటిదేంలేదండి" అని శేఖర్ ఏదో చెప్పబోతూంటే,

"లేదునాన్నా! బావగారికి టీ జ్ఞాపకంవచ్చి, జడిసి రాకుండా మానుకున్నాడు అంతే! అంతేగదండి శేఖర్గారు" అంది.

చనువుగా ఆమెచేసిన హేళనకు అతను నవ్వి వూరుకున్నాడు.

"నీవేం చదువుతున్నావ్ నాయనా" అన్నాడు గాయిత్రి నాన్న.

"బి. ఏ" అన్నాడు శేఖర్,

"ఒక చిన్న కోరికవుంది-అడగమంటావా" అంది గాయిత్రి.

"అడగండి!"

"మీరు నాకు లాజిక్ ప్రయివేట్ చెప్పగలరా" అంది గాయిత్రి.

"అవున్నాయనా! అమ్మాయికి ఆ సబ్జక్టులోచాలా తక్కువ మార్కులొస్తున్నాయి - నీకు తీరిక వేళలో చెప్పు - అది నీ సబ్జక్టేగా" అన్నాడు. ముసలాయన కుమార్తె అడిగిన దానిని బలపరస్తూ.

అసలే పిరికి! అందులో ఒక యువతికి బోధనచేయమని ఆమె తండ్రి కోరడంతో శేఖర్ మరీ యిరకాటంలోపడిపోయాడు. ఆమెకు ప్రయివేట్ చెప్పడం అనేసరికి ముచ్చెమటలుపోసాయి. కాని అతనికి తెలియకుండా "అలాగేలెండి" అని జవాబు యీవలకు వచ్చింది.

మరుసటిదినమే ప్రయివేట్ మొదలుబెట్టి ఆమెకు శ్రద్ధగా అర్థం అయ్యేలాగా బోధించ ప్రయత్నించాడు. అతను వచ్చేసరికి గాయిత్రి శృంగారంగా అలంకరించుకొని టీ కప్పుతో రెడీగా వుండేది. మొదటి రోజుల్లో విముఖత్వంచూపినా రానురాను ఆమె చేతిమీదుగా టీ పుచ్చుకోవడానికి బద్ధుడయ్యాడు. ఆమెకూ పాఠం ఏలావున్నా చంద్రుడిలాంటి శేఖర్ తన ఎదురుగా వుండడమే ఆమె కోరిక. శేఖర్ని చూచేసరికి ఆమెలో వింత వింత ఆలోచనలు పొడసూపేవి. అతను వున్నంతవరకు అమర సుఖం అనుభవిస్తున్నట్లు భావిస్తూండేది.

యిద్దరు యువతీ యువకుల్ని స్వేచ్ఛగా వదిలితే జరిగే పరిణామం! ప్రేమ. ఆ ప్రేమే శేఖర్ గాయిత్రి విషయంలో తటస్థపడింది. కాని లోకంలో ప్రేమించి, ఆ ప్రేమను సాఫల్యంచేసుకొన్నవారు అరుదు. దానికి కాలం, కర్మం, పరిస్థితులు - అడ్డుతగులుతాయి - వాటికి దాసాను దాసులైపోతారు - కాని వాడు విజయం పొందుతాడు.

అదే జరిగింది శేఖర్ గాయిత్రీల విషయంలో - వారి ప్రణయానికి అడ్డుగోడ ఏర్పడ్డాయి.

గాయిత్రి తండ్రికి అక్కడినుంచి ట్రాన్సుఫర్ గావడంతో పరిస్థితులు తలక్రిందులయ్యాయి - యిద్దరు ఆలోచించారు - స్వతంత్ర ప్రపంచంలో జంటపక్షుల్లాగా విహరిస్తూ వెళ్ళిపోదామని. కాని అంతటి సాహసం - తల్లి తండ్రులనువిడిచి, వ్యతిరేకించి పారిపోవడం పిరికితనంగల శేఖర్‌కి సాధ్యపడలేదు. ఆమె మట్టుకు వెళ్ళిపోడానికి సిద్ధమయింది. అతని పిరికితనం ఆమె ప్రేమనుగూడా కప్పిపుచ్చగలిగింది. ఒక నిశ్చయానికి రాలేకపోయాడు.

♦ ♦ ♦

అక్కడనుంచి వెళ్ళిన గాయిత్రినుండి 1 సం॥ వరకు ఉత్తరాలు వచ్చాయి శేఖరికి - అంతే మరి ఆమె విషయం తరవాత తెలియలేదు శేఖరికి. అప్పటినుంచి ఆమెకై విచారించాడు కాని ఆమె ఉనికి తెలియలేదు.

♦ ♦ ♦

ఆఫీసు గోడ గడియారం సాయంత్రం 5 గంటలు కొట్టడంతో యీలోకంలో వచ్చి పడ్డాడు శేఖర్ పూర్వస్మృతులనుంచి — అతని అత్రుత గాయిత్రె లావుందనేసి సాయంత్రమే ఆమె యింటికి వెళ్ళి ఆమె అమృతహస్తం మీదుగా టీ పుచ్చుకోవాలని కోరిక కలిగింది. తను పెద్ద ఉద్యోగినని, తెలియపరచడం ఆమె మనసు కించపరచడమే అని అనుకొన్నాడు. సామాన్యంగా వుంటే ఆమెకు కష్టంగలిగించని వాడనౌతానని అతని ఊహ.

ఇంటికి తిరిగి వచ్చిన శేఖర్ అదరాబదరా దుస్తులు మార్చి చాలా సింపుల్‌గా పంచె, షర్టు వేసుకొని బయలుదేరాడు. భార్య గోమతి అడిగింది "అర్జంట్ పనిపై వెడుతున్నారా! అని"

"అవును రవిని జాగ్రత్తగా చూచుకుంటూవుండు! కొంచెం లేటుగావస్తాను" అని శేఖర్ అన్నాడు

బస్సుపై ఆమె చెప్పిన వీధికి చేరి, ఆమె యింటిని కనుక్కొని వెళ్లేసరికి రాత్రి 8 గంటలు అయింది తలుపు తట్టేసరికి "ఎవరు వారు"! అంటూ గాయిత్రి తలుపు తీసింది. ఎదురుగా నిలబడిన శేఖర్ని చూచి ఆశ్చర్యపడింది.

"మీరు రేపు కదా వస్తానన్నారు?" అని ప్రశ్నించింది

"నిజమే! కాని నిన్ను కలుసుకొని వివరాలు కనుక్కోవాలనే నా అత్రుత ఇలా రాడానికి కారణం. నీ అమృత హస్తం మీదుగా టీ పుచ్చుకోవాలనే వాంఛ గాఢంగావుండి యీలారాడానికి ప్రేరేపించింది."

ఆమెనవ్వుతూ "చాలా బాగుంది. యిప్పుడు మీకు ఫలహారం తెచ్చి పెట్టడం సాధ్యంకాదు! శేఖర్ గారు! పోనీండి టీపెట్టిస్తాను" అంది. ఆ యిల్లు వుండే తీరుచూస్తే గాయిత్రి ఎటువంటి జీవనం గడుపుతుండేది ప్రతిబింబంగా పసికట్టవచ్చు. నల్లటి పొగ చారలు పారిన గోడలు, పై భాగంనుండి మట్టిపెళ్లలు, విరిగి పడుతూండి, ఒకే కిటికీతో అది కూపస్థంలా వుంది. యిల్లు అనడానికి వల్లగానిది. గది, దాన్నంటి వంటగదీ అంతే. యింట్లో సామానల్లా ఒకచాప, ఆమె స్కూలుకు వేసుకొని వెళ్లే బట్టలుజత, ఒకట్రంకు, తప్ప యింకేమి లేవు.

"గాయిత్రీ! నీ విక్కడ ఎన్నిదినాల నుంచి వున్నావు అసలీలారావడానికి కారణం" అన్నాడు శేఖర్. గాయిత్రి చెప్పిందాల్లో సారాంశం—అక్కడ నుండి ట్రాన్సుఫర్ అయి వెళ్ళిన సంవత్సరానికే వాళ్ళమ్మ చనిపోయింది. మరుసటి సంవత్సరం తండ్రి గూడా దిగులుతో చనిపోయాడు. ఆయన పోయేసరికి వారికి మిగిలిందల్లా 10 వేల అప్పు, ఒక యిల్లు. అప్పటికే వాళ్ళన్నకు వివాహం జరిగివుండింది. అపై అతను క్షయవ్యాధికి ఆహుతి అయి 1 సం॥ క్రితం స్వర్గస్థుడయ్యాడు — అతని భార్య యిద్దరి బిడ్డల పోషణ భారం గాయిత్రిపై పడింది. తండ్రి పోయేసరికి బి. ఏ చదువుతుండింది కాబట్టి అది ఎలాగో కష్టపడి పూర్తిచేసి యిక్కడికి టీచర్‌గా వచ్చింది.

"మీరు యిక్కడ వుద్యోగంలోవున్నారని నాకు తెలియదు శేఖర్ గారూ !" అంది.

మరి పదినిమషాలు మాట్లాడి వంటింటిలోనికి వెళ్ళి, 15 నిమిషాలలో 2 కప్పుల టీ తీసుకొని వచ్చింది. శేఖర్ కు ఒకటి అందించింది.

"మీకు అతిథి సత్కారాలు ఎక్కువగా చేయలేక పోయాను - క్షమించండి" అంది గాయిత్రి.

టీని ఒకసారి నోటిదగ్గర పెట్టుకొని ఒక గుటక వేసేసరికి పంచప్రాణాలు గుర్రుమన్నాయి. ఆ టీ అంత చెడ్డ వాసన వేస్తున్నది. శేఖర్ కు నిజంగా కళ్లు తిరిగిపోయాయి. నోటి వద్దపెట్టిన కప్పును దించి చేతిలో పట్టుకొని వుండిపోయాడు. అతను ఆ టీ తాగడానికి తటపాయిస్తున్నది గమనించిన గాయిత్రి మొహం వివర్ణమైంది. తల వంచేసుకుంది.

మరోసారి, ఆవిడముందు ఓడిపోయాడు; ఆ నాడు కూడా అలాగే వోడిపోయాడు తల ఎత్తి ఆమెను చూచేసరికి, ఆమె అప్పటికే తలవంచేసుకున్నది గమనించాడు. కాని ఈ సారిమటుకు శేఖర్ గాయిత్రిని సంతోష పెట్టడానికి ఏమైనా త్యాగం చెయ్యాలనుకున్నాడు. ఆమె సంతోషమే తన సంతోషంగా భావించాడు. ఆ వాసనగా వున్న టీనే సంకోచంలేక హృదయ పూర్వకంగా సేవించాడు. గాయిత్రి కళ్ళలో కృతజ్ఞత, సంతృప్తి గోచరించింది.

◆ ◆ ◆

మానవుడు ముందు ఆలోచనలేకుండా తప్పటడుగు వేస్తాడు. మళ్ళీ అది సక్రమమైంది గాదనప్పుడు మొదటి దానికై ప్రాకులాడడం సహజం. అదే శేఖర్ కూ తటస్థించింది. ఇంటికితిరిగి వచ్చిన శేఖర్ హృదయంలో భగభగమని జ్వాలలు ప్రజ్వలించాయి. తన పిరికితనం వల్ల గదా ఆమె అంతటి హీన జీవితం గడుపుతుండేది. యిప్పుడు వున్నంత ధైర్యం అప్పుడే వుంటే ఎంతబాగుండేది. ధైర్యం చేయలేక పోయాను. పెద్ద వుద్యోగినైవుండి, ఆమె అలా కడుహీనంగా జీవించడం చూచి వూరకుండడం న్యాయమా ? అని పించింది. శేఖరికి రాత్రంతా నిద్ర లేకుండా ఆలోచించినా ఒకనిర్ణయానికి రాలేక పోయాడు. మరుసటి దినం ఉదయం ఆలోచించాడు. నిజం తెల్పి, ఆమెకు తగిన సహాయం చేద్దాం అనుకొని అదే నిశ్చయానికి వచ్చాడు. శేఖర్ ఆ విషయంలోనూ ఓడిపోయాడు. అతడు ఆశించిందల్లా విఫలమైంది. అసలు గాయిత్రి విగ్రహమే యీ విశాల ప్రపంచంలోనుంచి అంతరించి పోయింది.

శేఖర్ సాయంత్రం గాయిత్రి యింటికి వెళ్లేసరికి ఆయింటి యజమానురాలు చెప్పింది. పాముకాటువేసి గాయిత్రి ఆస్పత్రిలో చేర్చబడిందని — అపాయ స్థితిలోవుందని. ఆస్పత్రికి వెళ్ళిన శేఖరికి, గాయిత్రి అంతిమ శ్వాస తీసుకొంటుండడం కనుపించింది.

"గాయిత్రీ !" అని పలకరించి "ఓడిపోయాను గాయిత్రి ! నీముందు అన్నివిషయాలలోనూ ఓడిపోయాను. అటు నీవు, ఇటునేను సంతోషించలేక పోయాం. నిజంగా నీకు చేసిన అన్యాయం చాలా ఘోరమైంది. నీ సుఖం కోసం త్యాగం చెయ్యలేక పోయాను — పిరికిపందని - అందే ఫలాన్ని, అంది పుచ్చుకోడానికి యత్నించక — గగన కుసుమంకోసం ప్రేలాడాను. నన్ను క్షమించవూ" ! అన్నాడు శేఖర్.

"శేఖర్ బాబూ ! ఎందుకంత బేలాగా మాట్లాడుతారు. ఎవరి మొహాన ఎలావ్రాసివుంటే ఆవిధంగా జరిగి తీరుతుంది...యికనైనా పిరికితనం వదలి లక్షణంగా వివాహం చేసుకొని సుఖించండి. అందని పండ్లకు ఆశించకండి! శలవు !" అని హీనస్వరంతో మాట్లాడింది. ఆపాము కాటు ప్రమాదమైనందున - ఆమె తిరిగి కోలుకోలేక పోయింది — మూడు దినాలు ఎలాగో గడిపినా నాలుగవ దినం - ఆమె ప్రాణ వాయువులు అంతరించాయి — ఆ దివ్యజ్యోతి లేచి పోయింది. ఓడిపోయిన యోధుడులాగా చూస్తూ వుండిపోయాడు - కళ్ళల్లో నీళ్లు బొటబొట కారుస్తూ- శేఖర్!

# ఆదర్శం

శ్రీ సి. హెచ్. శ్రీరామమూర్తి

రామారావు ఆదర్శభావాలుగల వ్యక్తి. అతనికి సంఘసేవయందాసక్తి యెక్కువ. ఈ కోరిక అతనికి కాలేజిలో చదువుతుండగానే కలిగింది, కాని యింతవరకు అతని కవకాశం చిక్కలేదు. ఇప్పుడతను తాలూకాలో "రివిన్యూ యినస్పెక్టరు" చేస్తున్నాడు. కాలేజిలో చదివేటప్పుడు సైమంతా చదువుకుందుకే సరిపోయేది కాదు. ఇప్పుడుద్యోగ ధర్మ నిర్వహణతోటే సరిపోతోంది రోజంతా. ఇక సంఘసేవ చేసేదెప్పుడు? ఇదే అతనికి పెద్ద సమస్యై కూర్చుంది.

ఒకనాడేదో ఆలోచిస్తుండగా చటుక్కున అతనికి తన కాలేజిలో జరిగిన ఒక మీటింగులో అధ్యక్షుడు చెప్పిన మాటలుకొన్ని జ్ఞాపకానికొచ్చాయి. ఆ అధ్యక్షుడెవరో జ్ఞప్తికి రావటం లేదు కాని ఆయన "సంఘసేవ" గురించి చెప్పిన కొన్ని ముఖ్యమైన మాటలు మాత్రమిప్పుడు నెమరుకు రాసాగాయి...

"...సంఘసేవ" అంటే కేవలం అసహాయులైనవారికి సహాయం చేయడం, అపాయంలోనున్న వారిని రక్షించడం, అందరికీ ఉపయోగమైన పన్లు చేయటమే కాదు. మన సంఘంలోని కుళ్లునుపోగొట్టి దానిని బాగుచేయడంకూడ సఘంసేవయే. ఉదాహరణమునకు స్త్రీ పునర్వివాహము తీసికొనండి. ఈ నిషేధమును పోగొట్టుటకు, రాజారామ్ మోహనరాయ్, వీరేశలింగంపంతులు, మొదలైన వారెంత పాటుపడిరో మీకందరకు తెలిసియే యుండును. కాని యింకను చాల మంది పూర్వాచార పరాయణులు వితంతు వివాహములన్న విముఖత చూపుచునేయున్నారు. కనుక మీలాంటి యువకులంతా కంకణంకట్టుకొని స్త్రీ పునర్వివాహములను ప్రోత్సహించవలెను........"

చదువుధ్యాసలో పడి యీ విషయాన్నే మర్చిపోయాడు. తనింకా అవివాహితుడు. ఇప్పుడెందుకా ఆదర్శాన్ని ఆచరణలో పెట్టకూడదు? అనుకున్నాడు. గొప్పసంస్కర్త వలెయెందరినో ప్రోత్సహించి చాలమంది అభాగినుల నుద్ధరింపలేకున్నను తానొక వితంతువునైననుద్ధరింపవచ్చుననుకున్నాడు. వీరేశలింగంపంతులుగారి స్వీయకధను, వారు వ్రాసిన పుస్తకాలను చదవడం మొదలెట్టాడు.

ఆవేళ క్యాంపునుండి రావడం కొంచెమాలస్యమైంది. భోజనంచేసి కాస్సేపు కుర్చీలో నడుంవాల్చాడు. అంతే ఇంతట్లోకే రోదనధ్వనులు వినిపించా యెక్కడనుంచో! అప్పుడు పదిగంటలు దాటుతుం

దేమో. ఇంత రాత్రివేళ యెవరేడుస్తున్నారాలని వీధిలోకి వెళ్లి కాస్సేపు వినేటప్పటికి ధ్వని రెండు మూడిళ్లవతలనుంచి వస్తున్నట్లనిపించింది. వెళ్లి చూసేటప్పటికి కాయేడుపు రిటైర్డు డిప్టీకలక్టరు వెంకట్రావుగారింట్లోంచి అని తేలింది.

సంగతి తెల్సికొనేందుకు లోపలికి వెళ్లాడు. ఇంకా నలుగురైదుగురు వచ్చారు చుట్టు ప్రక్కల వాళ్ళు. వెంకట్రావు గారల్లుడు గుండెజబ్బుచే మరణించాడని టెలిగ్రాము వచ్చిందట! ఆశ్చర్యపోయాడు రామారావు. పెళ్ళై యింకా నెలరోజులు కాలేదు, ఇంతట్లోకే యింతప్రమాదం జరిగింది. వెంకట్రావుగారి కుటుంబానికి తన సంతాపాన్ని తెలియజేసాడు. వారి కుటుంబాన్ని విచారించవద్దనీ, విచారించడం వ్యర్థమనీ నాలుగు సానుభూతి వాక్యాలు పలికి యింటికి వెళ్ళిపోయాడు. ఎవరైనా అంతకంటె యింకేం చెయ్యగలరు?

అప్పటినుండి తనకు తీరుబడైనప్పుడల్లా వెంకట్రావుగారింటికెళ్ళి వాళ్ళని ఊరడిస్తుండేవాడు. వెంకట్రావుగారాధునికి సాంప్రదాయానికి చెందిన వారవడంచేత ఆయన కుమార్తె "కమల"కు కేశఖండనము మాత్రము చేయించలేదు. పాపం పెద్దకట్నమిచ్చి ఉన్న ఒక్క కుమార్తెను వివాహంచేసారు. కాని విధివ్రాత వేరైంది. కమలను చూస్తే ఆదంపతుల కడుపు తరుక్కుపోతోంది. కానిఏంచేయగలరు! మరల వివాహం చేయడం సాధ్యమా? వివాహమాడేదెవరు? ఇత్యాది ప్రశ్నలు వారి నెదుర్కొనేవి.

రామారావు వెళ్లినపుడెల్లా వెంకట్రావు గారితో నేటి సంఘంలోని వితంతువుల పరిస్థితులు, వీరినుద్ధరించుటకు పంతులు గారు పడ్డశ్రమ మొదలైన విషయాలు చర్చించేవాడు. ఆయనకూడ తనకుమార్తె విషయమై మిక్కిలి విచారించేవాడు.

ఒక ఆదివారంనాడు వాళ్ళింటికెళ్ళాడు రామారావు. ఆ వేళ వెంకట్రావుగారెక్కడికో పనిమీద వెళ్ళారు. ఆయన లేరని చెప్పడానికి గుమ్మంలోకి వచ్చినపుడు కమలను చూసాడు. అంతక్రితం మెప్పుడూ ఆమె నంత తీరిగ్గా చూడలేదతను. ఆమె ముఖంమీద బొట్టులేక పోవడ మామె అందానికే లోటనిపించిందతనికి. తిరిగి వెళ్ళి పోయేటప్పుడతనికి తను వితంతు వివాహమాడుటకు చేసికొన్న నిశ్చయము జ్ఞప్తికొచ్చింది. కమలనే వివాహం చేసికొంటేయేమి? అనే ప్రశ్న తట్టింది. కాని వెంకట్రావుగారొప్పుగుంటారో లేదో! అయినా మర్నాడామె వివాహ విషయమాయనతో మాట్లాడ దల్చుగున్నాడు.

అనుకున్నట్లే చేసాడు. మాటల సందర్భంలో "కమలకు మరల వివాహం చేస్తేనో?" అన్నాడు రామారావు

వెంకట్రావుగారితో. ఆయన నిరుత్సాహంతో "చేసికొనే వారెవరు నాయనా?" అన్నారు.

"మీ కిష్టమైతే నేనే చేసుకుంటా" నన్నాడు రామారావు సమాధానం కోసం యెదురు చూస్తూ.

వెంకట్రావుగారుప్పొంగి పోయారు. "నిజమేనా?" అన్నారు గట్టిగా సందేహం తీర్చుకొనేందుకు. అతని నిశ్చయం తెలిసికొన్న వెంకట్రావుగారంతులేని ఆనందంతో మునిగి పోయారు. లోనికి వెళ్లి భార్యతోను కుమార్తెతోను శుభవార్త చెప్పారు. ఇక ఆ కుటుంబం యొక్క ఆనందం చెప్పేదేముంది?

ముహూర్తం త్వరలోనే పెట్టించి వివాహం చేసా రతివైభవంగా వెంకట్రావుగారు. మర్నాడే పత్రికలలో పడింది "కమలా రామారావుల ఆదర్శ వివాహం" గురించి. రామారావు తన ఆదర్శం సిద్ధించిందని, తను కొంచెమైనా సంఘసేవ చేయగలిగానని ఎంతో సంతోషించాడు. మిత్రులంతా అతన్నెక్కువగా అభినందించారు.

---



# బాలనాగమ్మకథ

(క్రీ. శ. 1340 ప్రాంతం)

శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు

---

ఇదొక జంగంకథ * చందువు, అంటే గేయం, వచనంకూడ ఉన్నాయి. దీని ఊతపదాలు - “తందాన; తందాన రాజనందనానా, తందాన భాయి, రాజనందనానా.”

## కవి ఎవరు ?

కవి పేరు ఈ గ్రంథంలో ఎక్కడా కనబడదు. కాని ఒక విశేషమేమంటే - ఈ గేయ కావ్యంలోని పలుకుబళ్లు, వాక్యాలు కుమారరామునికథ, గాంధారి కథలలో ఉన్నాయి. నీమాజ్ఞామూవంటి తురక మాటలు, పుక్కిటివిడెము చెదరనవ్వి మొదలైన దేశీయాలు పైన చెప్పిన గ్రంథాలలోవే! ఒక్క కవే ఈ గ్రంథాలన్నిటిని రచించేడన్నమాట పొసగదు. ఎందుచేతంటే, గాంధారికథ క్రీ. శ. 1300 ప్రాంతపు రచన అయితే, బాలనాగమ్మకథ 1340 ప్రాంతపు కూర్పు అని చెప్పవచ్చు. కుమారరామునికథతో కూడ ఈ మూడు పుస్తకాలను ఒక్క కవే రచించేడు అనడం అసమంజసం. కాబట్టి కుమారరాముని కథ, గాంధారికథ రచించిన కవి వంశంలోనివాడే బాలనాగమ్మ కథనుకూడ రచించి ఉంటాడని చెప్పవచ్చు.

## కథలోని ప్రదేశం

ఈ కథలో అనేక స్థానికపుపేర్లు కనబడుతున్నాయి. వాటిలో కొన్ని - భూచక్రపట్టణం, నల్లగొండ, జటంగి పర్వతం, ♦ పానుగల్లు, వంగపట్టణం, నయనవాది పట్టణం, గండికోట, నాగళ్ళపూడి, నూగాలీపేట, వెండికోట. ఇక్కడ మంచి భంగాకు దొరుకుతుందిట, పూసలపాడు - ఇక్కడ గంజాయి దొరుకుతుందిట, చిలుకవాడి పట్టణం, గంగవాడిపట్టణం, దొంతిరాజుపట్టణం, పులిరాజు పట్టణం, రక్తకొల్లుపట్టణం, నరేల్ పట్టణం, పేరుగుంట మొదలైనవి.

పైన చెప్పిన పేర్లలో కొన్ని వ్యంగ్యాలు, కల్పితాలుకూడ ఉన్నాయి. మొత్తంమీద కథలోని ప్రదేశం రాయల సీమలోని, తెలంగాణాలోని కొంత స్థలం.

## పాత్రల పేర్లు

నవభోజరాజు భూచక్ర పట్టణాన్ని ఏలుతున్నాడు. అతని భార్య మాణిక్యాలదేవి. నయనవాది పట్టణమేలేరాజు ధవళరాజు. సుందులమాదేవి, మంత్రి బ్రహ్మయ్య, ఏడుగురు కొడుకులపేర్లు, వారి భార్యలపేర్లు, జయమునిరాజు, కరణం గురవరాజు, గువ్వల తిరువెంగడం మొదలైనవి. వీటిలో చారిత్రక నామాలున్నాయా ?

## వ్యంగ్యత

ఈ గేయ రచనలో వ్యంగ్యత కనబడుతూంది. గాంధారికథ వ్యంగ్య రచనేకదా! వ్యంగ్యతవల్ల బాలనాగమ్మకథలో ముఖ్య స్థలాలపేర్లు, ముఖ్య పాత్రలపేర్లు మార్చివేయబడ్డాయి. ఈ గేయకవి తెలంగాణా వాస్తవ్యుడు అయియుంటాడు. కాబట్టి తెలంగాణంలో జరిగినకథను చెప్పడంలో వ్యంగ్య

---

* బాలనాగమ్మకథను అనేకమంది పుస్తకాల కంపెనీలవారు అచ్చువేసేరు. అమెరికన్ డైమండు ప్రెస్ మదరాసులో 1915 లో అచ్చయిన ప్రతిలో డెమ్మి సైజున 128 పుటలున్నాయి.

♦ జటంగి పర్వత మెక్కడ ఉందో తెలియదు. కాని జటింగరామేశ్వరము అను గ్రామం మైసూరు రాష్ట్రంలో చిత్రదుర్గ జిల్లాలో ఉంది.

తను ఆశ్రయించవలసి వచ్చింది, కారణం ముందు ముందు తెలుస్తుంది.

### టూకీ కథ

ఈ జంగంకథను రెండు మాటలలో తెలియ జేస్తాను. భూచక్రపట్టణాన్ని నవభోజరాజు ఏలుతున్నాడు. అతను ఢిల్లీపాదుషాకి కప్పంకట్టేవాడు. అట్లే అతని అల్లుడు కార్యవద్దిరాజు పానుగంటి పట్టణాన్ని ఏలుతున్నాడు. ఇద్దరుకూడ ఢిల్లీపాదుషాకి కప్పంకట్టేవారు. నవభోజరాజు కప్పంకట్టలేకపోగా ఢిల్లీపాదుషా ఆ దేశాన్ని తన రాజ్యంలో కలుపుకొన్నాడు. కార్యవద్దిరాజు భార్యపేరు బాల నాగమ్మ. ఆమెను మాయల ఫకీరు జంగంవేషం వేసుకువచ్చి నాగళ్ళపూడిగట్టుకు ఎత్తుకుపోయేడు. బాలనాగమ్మ కొడుకైన బాలవద్దిరాజు మాయల ఫకీరుని చంపి, బాలనాగమ్మను రక్షించేడు.

### కథాకాలం

ఈ కథ ఏకాలపుది అన్నదొక గడ్డు ప్రశ్న. దీనిని స్థూలంగా ఏకాలానికి ముడిపెట్టవచ్చో మొదట చూద్దాం. ఆ తర్వాత సూక్ష్మంగా నిర్ణయించడానికి ప్రయత్నంచేయవచ్చు. ఈ విషయంలో కావ్యశైలి కొంతవరకు సహాయపడుతుంది. గాంధారి కుమారరాముని కథలతోగల శైలీ సమత్వాన్నిబట్టి దీనిని వాటికి సమీప కాలమందే ఉంచవలసి వస్తూంది, అనగా పద్నాలుగో శతాబ్దం.

ఈ కథలోని ఫకీరు జంగంవేషం వేసుకొన్నాడు, వీరశైవ మతం 1150 నుండి బయలుదేరింది కాబట్టి ఈ కథ అటు తర్వాతది అని స్పష్టమవుతూంది.

జటంగిమహాముని తపస్సును వర్ణిస్తూ కవి-

> మహాముని చెవులలోపలను
> నాగుబాములు యిరవుచేసెనయ్యా

అంటాడు. క్రీ. శ. 1250 ప్రాంతంలో రచించబడ్డ సుమతీశతకంలోని-

> చీమలు పెట్టిన పుట్టలు
> పాముల కిరవైనయట్లు

అను మాటలను స్మరింపజేస్తున్నాయి.

ఈ గేయంలో 'కుంపిని' దుర్గాలు (పుట 1) అనుమాట కనబడుతూంది. దీనినిచూసి క్రీ. శ. 1600 ప్రాంతంనుంచి బయలుదేరిన పాశ్చాత్యుల కుంపినీలు (Companys) అను మాటతో పొరపడరాదు. ముద్రాపకుల మితిలేని అచ్చుతప్పులలో అదొకటి. కుంభినీదుర్గంకాని అది మరొకటి కాదు. దుర్గాలులేక కోటలు అనేక రకాలు - గిరిదుర్గం, వనదుర్గం, జలదుర్గం, స్థలదుర్గం * కేవలం నేలమీద గోడలు లేవదీసి కట్టిన దుర్గాన్ని కుంభినీదుర్గం, లేక స్థలదుర్గం అంటారు. దీనికి పూర్తి తెలుగుమాట 'నేలకోట'. కుమారరామునికథ, గాంధారి కథలలో కుంభినీ దుర్గాలు అనుపదముంది. ఆ పదం దీనిలో కూడ వాడబడింది. కాబట్టి ఈ పదం కాలనిర్ణయానికి తోడ్పడదు.

ఈ కథలో వద్దిరాజుల పేర్లంటూ, కార్యవద్దిరాజు, బాలవద్దిరాజు మొదలైనవి కనబడుతున్నాయి. ఈ వద్దిరాజులు ఒడ్డెరాజులు ఒక్కరే! ఒడ్డెరాజు అనుమాట సామాన్య జనుల ఉచ్చారణలో వద్దిరాజు అయింది. ఈ ఒడ్డె రాజులు కాకతీయరాజుల కాలంలోనివారు. వీరి పుట్టు పూర్వోత్తరాన్ని కొంచెం తెలుసుకొందాం. "కాయస్థులనువారు ఉత్తర (హిందూ) దేశంలోని ఒక కులంవారు. లెక్కడొక్కలు వ్రాయడములో వీరు గట్టివారు. వీరిలో కొందరు కాలక్రమాన కాకతీరాజన్యుల ప్రాపకం పొంది రాజ్యంకూడ సంపాదించేరు. వీరిని ఒడ్డెరాజులంటారు ♦ "

ఈ ఒడ్డె రాజులను గురించి నేలటూరి వెంకటరమణయ్యగారు ఇట్లు చెప్పుతున్నారు. "ఒడ్డెవారును ఆంధ్రదేశమునకువచ్చి యచ్చట స్థిరనిలయము లేర్పరచుకొనిరి. ఒడ్డెవారనగా ఓఢ్రదేశ వాస్త

* చిలుకూరి వీరభద్రరావుగారి కాకతీయాంధ్రరాజచరిత్ర, పుట 481.

♦ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు రచించిన ఆంధ్రదేశచరిత్ర సంగ్రహం, పుట 69.

వ్యులు. వీరిపుడు తాము కాళింగులమని చెప్పకొనుచున్నారు. కాళింగులు తెనుగువారు, ఓఢ్రులు కారు. వీరిభాష యోఢ్రము. క్రీ. శ. ప్రారంభమునుండి మాఠరాది వంశజులు కళింగమును పాలించుచుండిరి. తర్వాత పూర్వ చాళుక్యులును, పూర్వ గాంగులును ప్రభుత్వము సల్పిరి. క్రీ. శ. ౧౧-వ శతాబ్దాంతము వఱకును కళింగమున పూర్వ చాళుక్యుల యధికారము చెల్లినది. అందాక పూర్వ గాంగులు సంపూర్ణ స్వాతంత్ర్యమును బొందలేరు. తరువాత వారు ప్రబలి స్వతంత్రులై దమకు పూర్వ దిక్కుననున్న యోఢ్రదేశమును జయించి తమ రాజధానిని కళింగ నగరమునుండి మహానదీతీరమందలి బనారసకటకమునకు మార్చుకొనిరి. ఇదియే ఇప్పటి ఒరిస్సా మండల రాజధానియగు కటకము. ఒడ్డె వారు క్రీ. శ. ౧౧-వ శతాబ్దమందెప్పుడో వచ్చిరి. క్రీ. శ. పన్నెండవ శతాబ్దమున కడపమండలమును, దత్పరి సరసములను, వల్లూరు పట్టణమును రాజధాని చేసుకొని యొడ్డెరాజులు పాలించిరి. కులముచే వీరు కాయస్థులు. గంగయ సాహిణి, జన్నిగ దేవుడు, అంబదేవుడు మున్నగు వారొడ్డె రాజులలో ప్రముఖులు. వీరెవ్వరో, ఎచ్చటినుండి యేసందర్భమున నాంధ్రదేశమునకు వచ్చిరో తెలియదు. కాలక్రమమున వీరి రాజ్యము నాశనమందినది. వీరు తమ జాతివ్యక్తిత్వమును గోలుపోయి యాంధ్ర ప్రజలలో గలిసిపోయిరి. ‡ ”

బాలనాగమ్మకథలో ప్రాముఖ్యతను వచ్చిన ఒడ్డె రాజులు నారేకాని వేరెవ్వరూ కాదు. ఒడ్డెరాజుల ప్రశంస కథాకాల నిర్ణయానికి తోడ్పడుతూంది. వీరు కాకతీయుల కాలంలో ఉండేవారను విషయం పైఉద్ధృత భాగాలనుండి వెల్లడవుతూంది.

కుమారరామునికథలో ఉన్నట్లే ఈ కథలోకూడ తుపాకుల వాడకం కనబడుతూంది. అంతేకాదు “ఫిరంగి” అనుమాటకూడఉంది. మాయల ఫక్కీరుకి డొక్కలో ఫిరంగిగుండు తగలగా_

‘అబ్బా! ఏమో నల్లికరిచినాది’ అన్నాడుట! తుపాకులు, ఫిరంగులు ప్రథమ బుక్కరాయల (క్రీ. శ. 1354-79) కాలానికే ఉన్నట్లు తెలుస్తూంది. కాబట్టి అవి అంతకు పూర్వంనుంచి వాడుకలో ఉన్నాయని చెప్పవచ్చు. మొత్తంమీద ఈ కథాకాలం కాకతీయ పరిపాలన ముగిసిన పిమ్మట త్వరలోనే అని చెప్పవచ్చు. ఆ నాటి దేశస్థితిని సంగ్రహంగా తెలుసుకొందాం. †

కాకతీయ రాజ్యాన్ని వీరరుద్ర మహారాజు పరిపాలిస్తూండగా, ఢిల్లీ సుల్తాను ఓరుగంటి మీదికి ఎనిమిదిసార్లు దండయాత్ర చేసేడని హిందూరచయితల వాదం. ఎనిమిదో దండయాత్రలో అనగా క్రీ. శ. 1323 లో ఢిల్లీ సుల్తానయిన గయాసుద్దీన్ తొగ్లక్ తన కుమారుడైన ఉలుగ్ ఖాన్ (ఇతనే అటు తర్వాత మహమ్మద్ బిన్ తొగ్లక్ అయేడు)ను పంపేడు. ఈ దండయాత్రలో వరంగల్లు (ఓరుగల్లు) కూలిపోయింది. రాజును ఖైదీగా తీసుకుపోయేరు. రాజ్యాన్ని ఢిల్లీలో కలుపుకొన్నారు. వరంగల్‌కి సుల్తాన్‌పూర్ అని నామకరణం చేసేరు. ఇంతే కాకుండ తూర్పుకోస్తా జిల్లాలనుకూడ ఉలుగ్ ఖాన్ గెల్చేడు. గయాసుద్దీన్ 1325 లో మరణించగా అతని కుమారుడు మహమ్మద్ బిన్ తొగ్లక్ అను పేరుతో ఢిల్లీ సింహాసనాన్ని అధిష్టించేడు.

(సశేషము)

---

‡ ఆంధ్రులు - చరిత్ర, పుటలు 18, 19.

† ఆ నాటి దేశచరిత్రను నేలటూరి వెంకటరమణయ్యగారు The Early Muslim Expansion in South India (ఈ పుస్తకాన్ని మదరాసు విశ్వవిద్యాలయంవారు అచ్చువేసేరు) లోను, మల్లంపల్లి సోమశేఖర శర్మగారు A forgotten chapter of Andhra History (దీనిని ఆంధ్ర విశ్వ విద్యాలయంవారు అచ్చువేసేరు) లోను విపులంగా వ్రాసేరు.

# స్త్రీ విద్య - శిశు పోషణ

శ్రీమతి వడ్డి కృష్ణవేణి

—o—

"ఏమండీ సుబ్బమ్మగారు! ఏమిటో దీర్ఘంగ ఆలోచిస్తున్నారే?"

"ఆ! ఏంలేదండి."

"ఏమీలేకపోతే మీ రంతగ ఆలోచించరే? తగినంత కారణం ఏదో వుంటుంది దాస్తున్నారు."

"అబ్బే! దాచేంత రహస్యం ఏమీ లేదండి! ప్రభుత్వంవారికి ఏవిధంగా తెలియజెయ్యటమా" అని ఆలోచిస్తు న్నాను.

"దేనివిషయమండి?"

"స్త్రీ విద్య - శిశుపోషణనను గురించి ప్రభుత్వంవారు తగినశ్రద్ధ చూపాలండి."

"అదేమిటండి అల్లా అంటారు. ఇప్పుడు స్త్రీ విద్య అమలులోనే వుందిగా!"

"ఎందుకొచ్చిన చదువులండి. దైనందిన జీవితానికి ఉపకరించు విద్యకాదండి ఇది."

"దైనందిన జీవితానికి ఉపకరించక పోవటమేమిటండి! రాజేశ్వరి చదువు కున్నదిగాబట్టి ఆ భార్య భర్త లిద్దరు హాయిగ సంపాదించుకుంటున్నారు."

"బాగా చెప్పారు. ప్రస్తుతం స్త్రీ విద్య మీ రన్నట్లు ఉద్యోగానికే ఉపక రిస్తున్నది. రాజేశ్వరి తరగతుల ప్రకారం చదువుకున్నదేగాని ప్రపంచ జ్ఞానం శూన్యం. ఆవిడకు ఉద్యోగం చెయ్యటం తప్ప మరేం తెలియదు."

"ఎందుచేతనంటారు? చదువుకున్న వారికి తెలివితేటలు ఉంటాయంటారు గదండి!"

"తెలివితేటలకు, చదువులకు సంబంధం లేదండి. చదువుకున్నంత మాత్రాన తెలివి తేట లుంటాయనుకోవడం పొరపాటు. ఆవిడ చదువుకున్నదన్నమాటేగాని వారి పిల్లలు చూడండి ఎలా వుంటారో?"

"మరి ఆవిడకు పగలంత ఆఫీసు చాకిరితో సరిపోతుంది. పాపం! ఆ పిల్లల్ని ఇంటి దగ్గిర ఎవరు చూస్తారు! వాళ్లు ఇష్టా రాజ్యంగా తిరుగుతుంటారు."

"అదే పొరపాటు. అస్తమానం ఇంటి దగ్గిరవుంటే మాత్రం పిల్లలసేవ చెయ్యట మేనా చెప్పండి. వారికి చిన్నతనంనుంచి ఒక క్రమ శిక్షణ అలవడచెయ్యాలి. కమలగారి పిల్లలు చూడండి ఎంతనమ్రతగ వుంటారో. ఆ విడ ఏంచదువుకున్నది చెప్పండి. సంతకం చెయ్యటమన్నా రాదు. ఆ విడ క్రమశిక్షణవల్ల ఆ పిల్లలు బుద్ధి మంతులైనారు."

"చదువుకున్నవారికి క్రమశిక్షణ బాగా తెలియాలిగదా?"

"చదువుకున్నవారికి శిశుపోషణనను గురించి అసలు తెలియదంటాను. ఎందు చేతనంటారా? పాఠశాలలయందు పనికి మాలిన తిథులు, శబ్దాలు మొదలగువానితో వారి మనసులను నింపివేస్తారు. బాలికలు వానిని వల్లించుటయందే కాలం గడుపు తుంటారు. వారి లేత మనసులు వాని యందు లీనమైయుండుటవల్ల వారి హృద యంలో రెండో విషయానికి స్థానం దొర కదు."

"పోనీ! పాఠశాలవిద్య ముగిసిన తర్వాత ఇంటివద్ద శిశుపోషణ - గృహపరి శ్రమలు మొదలగు విషయములు మాతృ దేవివద్ద నేర్చుకొనవచ్చును గదా?"

"అలా నేర్చుకుంటే లేందేమున్నది. మన సోదరీమణులు ఆ సమయమునందు వినోదములగు కథలు చదువుట, లేసు లల్లుట మొదలగువానితో కాలంగడుపు తారు. శిశుపోషణ అననేమియో యెరు గని ఈ బాలిక తన బిడ్డలకు మాతృ దేవియైనప్పుడు ఎటువంటి క్రమశిక్షణ అల వడ జేస్తుంది చెప్పండి."

"లోకంలో చదువుకున్న వాళ్ళందరు ఇలాగే వున్నారంటే నేనేకీభవించనండి. సరోజిని చదువుకున్నదేకదా! ఆ విడ పిల్లలకు శిక్షణ ఎలా ఇస్తున్నదోచూడండి!"

"సరియైనమాట అడిగారు. సరోజిని క్రమశిక్షణ ఎలా వుంటుందంటే ప్రతి విష యములోను వారి లేత మనసులను అరి కట్టి తన ఆజ్ఞలకు వారి జీవితాలను బలి చేస్తున్నది. ఆవిడ కఠినవాక్కులవల్ల ఆ పిల్లలు ఈడుకు తగిన శరీర దారుఢ్యము లేక పిరికివారై లోకంలో పనికిమాలిన వారైరనుటలో సందియములేదు. రాజే శ్వరిని, సరోజినిని పోల్చిచూచిన రాజేశ్వరి పోషణే వెయ్యిరెట్లు మించింది. ఎందువల్ల నన ఆవిడ పిల్లల మనసులను అరికట్టక వారి యిష్టారాజ్యముగ ప్రవర్తించుటకు అనుమతిస్తుంది. దానివల్ల పిల్లలు ధైర్య, సాహసాలు కలవారగుచున్నారు."

"ఏమిటోనండి మీరు ప్రతిదానికి ఏదో ఒకటి చెప్తుంటారు."

"మీరు చాలా పొరపాటు పడ్తున్నారు. శిశుపోషణనను గురించి తగుశ్రద్ధ చూపక పోయిన ముందుముందు చాల బాధలు రాగ లవు. మాతృదేవి జ్ఞాన శూన్యతవల్ల గృహమునందెట్టి భయంకర పరిణామ ములు తటస్థించుచున్నవో చెప్పతరము కాదు."

"అయితే ఇప్పుడు స్త్రీలు ఎటువంటి విద్య నభ్యసించాలంటారు?"

"స్త్రీలు ముఖ్యముగ, శిశుపోషణ - మన స్తత్వ శాస్త్రమును గురించి నేర్చు కోవాలి. బిడ్డలయొక్క మనస్సును అవ గాహన మొనర్చుకొని, వారి కనుగుణ్యా మగు శిక్షణ యొసగి సన్మార్గులుగ చేయ

కలిగిన స్త్రీ నిజమైన మాతృదేవి యని పించుకొనగలదు. మాతృదేవి యొక్క క్రమశిక్షణ కలవడిన బిడ్డలు వారి భావి జీవితమందు వృద్ధిలోనికి రాగలరు."

"విశాల దృక్పథంతో ఆలోచించిన మీరు చెప్పిన విషయాలు నిజమే, ఇప్పటి కైన కాలయాపన చెయ్యక ప్రభుత్వానికి తెలియచెయ్యండి."

"నా ఒక్క దానివల్ల ఏమౌతుందండి. "జనవాక్యం కర్తవ్య" మని పదిమంది కలిసిచేస్తే ఏపనైనా అవుతుంది. మనతో బాటు ఏకీభవించగల భారత నారీమణులు ఇంకా ఎవరున్నారు!"

"లేకేమండి. చాలామంది వున్నారు. నేను తీసుకువస్తాను. అసలు ప్రభుత్వా నికి ఏమని తెలియజెయ్యాలో చెప్పండి."

"పాఠశాలలయందు స్త్రీలకు ప్రత్యేక ముగ శిశుపోషణ, గృహపరిశ్రమలు మొద లగునవి నేర్పుటకు ప్రభుత్వము అనుమతిం చాలి" అని భారత నారీమణులందరు ఏకగ్రీవంగ ఆందోళన మొదపెట్టాలి"

"మొదలు పెట్టిన సమస్యను నిర్వి ఘ్నంగా కొనసాగించగలమా?"

"ఏవిషయంలోను అంత అనుమాన ముండకూడదండి. పదిమంది సహకరించి నప్పుడు సాధించలేనిపని వుంటుందా?"

"అయితే కానివ్వండి! శుభస్య శీఘ్రం. రేపే కార్యదీక్ష ఆరంభిద్దాము. చాలాసేపయిందండి వెళ్ళొస్తాను."



# మనోరమ

శ్రీ రాజేంద్ర

---

పెళ్లి చూపులకు వెళ్లి నేనూ, మా నాన్నగారూ అప్పుడే ఇంటికి తిరిగి వచ్చాము. వచ్చిన ఐదునిముషాల్లోనే మామయ్యకూడా వచ్చాడు. వస్తూనే వచ్చిన పని కాస్తా వివరించేశాడు.

“అమ్మాయికి త్వరలో పెళ్లి చేసేయాలనుకొంటున్నాం. వేరే వరుణ్ణి అన్వేషించడమెందుకని మన వాడికే యిచ్చి చేసేద్దామనుకొన్నాను” అని తన ఉదారతను ప్రకటించి, అందరి ముఖాలూ ఎలా వున్నాయో అని చూశాడు.

ఎవ్వరం వెంటనే మాట్లాడలేక పోయాము. నాన్న మాత్రం “ఆఁ ... ”అన్నాడంతే. ఆశ్చర్యంతో ఉక్కిరి బిక్కిరి అయ్యాను నేను.

మా మామయ్య ఒక పెద్ద లక్షాధికారి. ఆయన ఎప్పుడూ మీదిచూపులు చూసేమనిషి అంటుంటారు. దారి తప్పికూడా, తనకంటే తక్కువస్థితిగలవారింటికి వెళ్లడు. నోరు తప్పికూడా హీనమైనవారితో ప్రసంగించడు. గత మూడేళ్లుగా మా యింటికీ, వారి యింటికీ మధ్య రాకపోకలుకూడా లేవు. నాకు మాత్రం మామయ్య కూతురు మనోరమతో పరిచయముంది. కొంతవరకూ స్నేహమూవుంది. ఇద్దరం ఒకే కాలేజీలో చదువుకొన్నాము. ఆమె సహజ సౌందర్యకంటే, ఆమె అలంకరణ ఆమెకు ఎంతో అందాన్నిచ్చేది. మామయ్య కూతురయినా నేనే నాడూ ఆమెతో అంత చనువుగా ప్రవర్తించివుండలేదు. ఆమె ఒక లక్షాధికారి కుమార్తెగనక, నాకు సరయిన గౌరవం ఆమె ఇవ్వకపోవచ్చు! అలాంటప్పుడు మనమై ఆమెతో అట్టే సంబంధం వుంచుకోవడం మంచిది కాదనుకొన్నాను. రెండుమూడు మార్లు ఆమె పిలిచింది ఇంటికి; వెళ్ళాను వచ్చాను. అంతే!

మొదట్లో ఆమెపై నా కేలాంటి అభిప్రాయమూ వుండేదికాదు. ఆమె గుణంలో ఎలాంటిదీ, అందంలో ఎలాంటిదనికూడా నేను ఆలోచించలేదు. ‘ఆమె అందని ప్రూనిపండ’ని నాకు తెలుసు. ఆమెను నా వశంచేసుకోవచ్చునా, ఆమె అందంగావుందా, ఆమె మంచిదా, ఆమెను ప్రేమిస్తే ... ఇలాంటి ఏ ఆలోచనలకూ నేను స్థానమివ్వలేదు. ధోరణి అదోరకంగానుంటుండేది.

కాలేజీలోని ప్రతి అమ్మాయినీచూసి, ప్రతిమారూ ఈ అమ్మాయి బావుంది, ఆ అమ్మాయి బావుంది ... ఈ అమ్మాయిని ప్రేమిస్తే, ఆ అమ్మాయిని ప్రేమిస్తే ఇలా వుండేవి ఆ నాటి నా ఆలోచనలు. ఇద్దరమ్మాయిలకు ‘లవ్ లెటర్స్’ వ్రాశాను. ఒకమ్మాయి ప్రత్యుత్తరమే వ్రాయలేదు. మరొకమ్మాయి చీవాట్లు పెడుతూ వ్రాసింది!

## 2

మనోరమ ఆస్థిపాస్తుల వివరాలు తెలిసిన ప్రతివాడూ, ఆమెతో స్నేహం చేసుకొనేవాడు. కొంతకాలం స్నేహంచేసిన తరువాత ఇక ఓపికపట్టలేక, తాము ఆమెను ప్రేమిస్తున్నట్లు ఏదో విధంగా తెలియజేసేవారు. ఆమె అందరి ప్రేమల్నీ నిరాకరించింది. అందరితోటీ ‘సోషల్ గా మూవయేది.’ తదాధారంతో యువకులు ఆమెప్రక్క చేరేవారు. షికార్లకూ, సినిమాలకూ వెళ్లేవారు. తర్వాత కొంతకాలానికి - “డియర్ నేను నిన్ను ప్రేమిస్తున్నా, నువ్వొక దేవతవు. నీవులేని నా జన్మవృథా!” అని ఎదుటనో, ఉత్తరాల ద్వారానో తెలియజేసుకొనేవారు. అంతటితో వారిమైత్రికి అంతరాయం ఏర్పడేది.

ఆ తర్వాత అనిపించింది నాకు ఈమె నిజంగా ఉత్తమురాలని. యువకులు నేర్చిన మాటలకు, ప్రేమించే పద్ధతులకు, ఎత్తుగడలకూ లొంగకుండా, ఇంత నిబ్బరంగా నిశ్చలంగావున్న ఈ సాధ్వి యువతులకు ఆదర్శయువతి అనుకొన్నాను.అయితే నా మట్టుకు నేను మాత్రం ఆమెను ఏనాడూ కోరివుండలేదు. ఆ వాంఛే నాలోలేదు. అయితే ఆమె నా

ప్రేమను అర్థించివుంటే నూటికి నూరుపాళ్లు కాదని వుండను.

వరూధినిలాంటి ప్రబంధకన్య కాకపోయినా మనోరమ చక్కగా వుంటుంది. కుబేరునికి కాకపోయినా ఒకస్థితిపరునికి కూతురై జన్మించింది. అందులో ఈమె 'ఏకైక కుమార్తె' మా మామయ్యకు.

ఇక నేనా ... సరేసరి ! మానాన్న ఒకస్కూలు మేష్టారు. అప్పట్లో మా మామయ్యవాళ్లుకూడా మా లాంటి వాళ్లేనట. అంచేత మా అమ్మను మా నాన్న గారి కివ్వటం జరిగింది. అప్పటిలో మా నాన్నగారి లాంటి నెలజీతంతీసే వరుడు లభించడమే ఒక పెన్నిధి లభించినట్లయిందటవారికి ! మా అమ్మ తమ్ముడే ఈ మామయ్య.

చిన్నప్పుడు చాలామార్లు మా మామయ్య వూరికి వెళ్ళాను. ఏనాడూ నన్నాయన ఆప్యాయంగా హృదయ పూర్వకంగా పలకరించినట్లు నాకు జ్ఞాపకం లేదు. అలాంటివ్యక్తి, ఈ నాడు హఠాత్తుగావచ్చి, ఇంతటి ప్రియంగా మాట్లాడుతుంటే ఆశ్చర్యం వేయదామరి !

ఆయన నన్ను గురించి నలుగుర్లో హీనంగా మాట్లాడడం నేనెరుగుదును. ఎంతలో ఎంతమార్పు. ఆశ్చర్యకరమైనమార్పు! మిమ్మల్ని ఒక నాడు చెప్పుతో చావమోదిన మనిషి, మరొకనాడు మిమ్మల్ని పూజించడానికి పూనుకొంటే మీ కెలా వుంటుంది ? నేను ఆ నాటినుంచీ ఈ నాటివరకూ ఒకే విధంగా వున్నాను. కాదంటే ఆ నాడు ఒక విద్యార్థిని, ఈ నాడు చదువు పూర్తిచేసి ఉద్యోగం చేస్తున్నాను. అంతే !

ముందులేని పెద్ద ఐశ్వర్యంగానీ, పెద్ద హోదాగానీ, లేదా అదనంగా మరే అర్హతగానీ ఈ నాడు వొరగలేదు. అలాంటప్పుడు ముందులేని అభిమానం ఇప్పుడు ఎక్కట్నుంచీ వచ్చింది ! పోనీ బంధుత్వం మీద, అభిమానం పుట్టిందనుకొందాం మామయ్యకు ! మనోరమ నన్ను చేసుకోడానికి ఎలా అంగీకరిస్తుంది ? ఆమెకు ఇష్టంలేనిది మామామయ్య ఇంతదూరం అదే పనిగా వస్తాడా !

అమ్మ వచ్చి మామయ్యనుచూసి అదిరిపోయింది. నాన్న ఆయన దగ్గర చాలా కాలం క్రితం నా చదువు కోసం 'రెండువేలు' తెచ్చాడు ! ఆ డబ్బును వసూలుచేసుకెళ్లడానికి వచ్చాడేమో. అలా అయితే కొంపమునిగినట్లే అనుకొన్నట్లుంది అమ్మ కొద్ది భయంతో, కోపంతో తీవ్రంగా ఆయనవైపు చూసింది, ఒక నిముషంవుండి—

"ఎప్పుడొచ్చావురా !" అంది అనలేక.

"ఇప్పుడే వచ్చా నక్కయ్యా! పెళ్ళి విషయం మాట్లాడాలని వచ్చాను. మళ్ళీ ఇప్పుడే వెళ్లాలి..." అన్నాడు మృదువుగా మామయ్య.

"పెళ్లెవరికీ" ఆత్రుతతో ప్రశ్నించింది అమ్మ. నేను అమ్మ కేసిచూసి చిన్నగా నవ్వాను.

"ఎవరకేమిటి ? నీ కొడుక్కీ, నా కూతురికీనూ" అన్నాడు మామయ్య గంభీరంగా నవ్వుతూ.

"ఆఁ ... నిజం ఎంత దయరా నీకు మేనల్లుడి మీద ... " అంది అమ్మ వ్యంగ్యంగా ! మామయ్య బాధ పడ్డట్లగుపించాడు. ముఖంలో హఠాత్తుగా రంగుమారి, మరికాసేపటికి యథాస్థితికి రాగలిగాడు.

"అసలు నాకు ఆదినుంచీ రామంమీద మంచి అభిప్రాయంవుంది. అమ్మాయిని రామానికి ఇవ్వాలనే ఏనాటినుంచో అనుకొంటున్నాను. ఇప్పుడు సమయం వచ్చింది గనక, ఇప్పుడేవచ్చి చెబుతున్నాను. ఈ విషయం ముందే చెప్పడం బావుండదని ... ఇంత కాలం పరధ్యానంగా వున్నాను."

పచ్చి అబద్ధం ! ఏమూఢుడూకూడా ఈ విషయాన్ని విశ్వసించలేడు, మా నాన్నని ఎదుట ఈ మనిషి హేళనగా మాట్లాడడం నేను నా చెవులారా విన్నాను. తన కూతుర్ని ఏమహావ్యక్తికో యిచ్చి చేస్తానని ఆయన ప్రగల్భాలు పలుకుతుండటంకూడా నేనే విన్నాను. వేరే సాక్ష్యమే అక్కర్లేదు.

ఒకమారు పండుగకు నన్ను ఆహ్వానించింది మనోరమ. నేను వెళ్ళాను, నేను గదిలో కూర్చుని ఏదో పత్రికను త్రిప్పుతున్నాను. కాఫీ తెస్తానని మనోరమ వంటింటివేపు వెళ్ళింది. మధ్యలో మామయ్య

ఎదురయి అంటున్నాడు.

"వాడిని ... ఆ దరిద్రుణ్ణి ఎందుకు రానిచ్చావు ఇంటికి, ఇలాంటి వెధవల్నంతా ఇంట్లో చేరుస్తూ వుంటే మన పరువు మర్యాదలు నిలుస్తాయా ... డిగ్నిటీ చెడుతుంది..." మనోరమ ఆయన మాటల్ని వినిపించుకోనట్లుంది. మరో ఐదునిముషాల్లో విలాసంగా కాఫీ తీసుకొచ్చింది. నేను అప్పుడే లేచివచ్చేద్దామనుకొన్నాను. అయితే మనోరమ సత్‌హృదయానికి సలాము కొట్టాల్సి వచ్చింది. వెంటనే వచ్చేస్తే మనోరమ బాధపడుతుంది. అందుకని వుండిపోయాను. మనోరమ ఒక అర్ధగంటసేపు ఏవేవో కబుర్లు చెప్పింది, పరధ్యానంగా వింటూ, అక్కడక్కడా ఒకొక్క మాట వేశాను. ఆ తర్వాత ఆమె దగ్గర వీడ్కోలు తీసుకొని వచ్చేశాను. మళ్లీ నాలుగయిదుమార్లు పిలిచింది. నేను వెళ్ళదలచుకోలేదు. వెళ్లలేదుకూడాను. మళ్ళీవెళ్లి అవమానింపబడడంకంటే నోరుమూసుక రూములోపడి వుండటం మంచిదనుకొన్నాను.

ఆ తర్వాత అంటే ఫైనల్ ఇయర్‌లో కొంత గలబా జరిగింది. ఒక కాలేజీ లెక్చరర్‌తో మనోరమ ప్రేమ, ప్రేమకలాపం సాగుతున్నట్లు ప్రచారం జరిగింది. ఒక రోజు కాలేజీ ఆవరణలో మనోరమ ఆ లెక్చరర్ని దుర్భాషలాడుతూ వుండటంచూసి విన్న కొందరు మనోరమను నిర్దోషిగానూ, నిష్కల్మష హృదయగానూ తీర్మానించారు. ఆ కొందరిలో నేనూ ఒకణ్ణి. లెక్చరరుగారికి మాత్రం ఆ అపవాదు శాశ్వతంగా వుండిపోయింది. ఆయన మనోరమను వంచించడానికి యత్నించినట్లూ, తిరస్కరింపబడి అవమానింపబడినట్లూకూడా పెద్ద ఎత్తున ప్రచారం జరిగింది.

## 3

కాఫీ తీసుకరావడానికేమో అమ్మ లోపలి కెళ్లింది. నాన్న ఇందాకా విస్తుపోయి కూర్చుండిపోయివుండి, చాల సేపటికి తేరుకొని సంభాషణను వుపక్రమించాడు.

"చాల సంతోషించదగినవార్త తెచ్చావుగానీ. అంతా ఎలా వున్నారు. ఈ మధ్య అక్కగారికి జబ్బు చేసిందన్నారు. మీ అక్కయ్య వెళ్ళిచూసి రావాలన్నది. ఇక్కడ నాకు పనులు తొందరగా వుండటం మూలంగా పూర్తి సమాచారం తెలిసినతర్వాత వెళ్దువులేయని ఆపేశాను" అన్నాడు నాన్న. మామయ్య మళ్ళీ బాధపడ్డట్లుండి, రెండు నిముషాలు ఏంమాట్లాడలేకపోయాడు. ముఖంరంగు మారింది, కళ తగ్గింది.

"ఇప్పుడేం ఫరవాలేదు. ఆ మధ్య యేదో చిన్న జబ్బుచేసింది అంతే" అని ఇంటికప్పుకేసి చూశాడు. కప్పు వెదుర్లలోంచి సన్నటిదుమ్ము రాలింది. తల వంచి కళ్లు తుడుచుకొన్నాడు. దుమ్మురాలితే వచ్చే కంటినీటికంటే అధికంగా కళ్లనీళ్లు వచ్చినట్లుంది.— పంచ చాలా తడిసింది.

ఇంతలో అమ్మ కాఫీ తెచ్చింది. కాఫీ రుచి చూసి క్రిందవుంచి నా వేపు చూశాడు. నేనింతవరకూ ఓ మూల చిన్నపాత స్టూలుమీద కూర్చుని, వార పత్రిక ముఖానికి అడ్డుంచుకొని, వోరచూపులు చూస్తూ (అమ్మాయిలాగా) చదువుతున్నట్లు నటిస్తున్నాను.

"రామం!" అన్నాడు మృదువుగా అనాలనే ప్రయత్నంలో విఫలుడై.

పత్రికను క్రిందికితీసి. "ఏంమామయ్యా" అన్నాను.

"వెంటనే ప్రయాణమవు, ఇప్పుడే వెళ్దాం. మనోరమ నిన్ను వెంటనే తీసుకరమ్మంది" అన్నాడు. నేను అలాగేనని లేచి రూముకెళ్ళాను. చక్కటి చల్లటి ఆలోచనలు తెరలు తెరలుగా వస్తూవుంటే, బుర్ర గాలిలో తేలిపోతున్నట్లనిపించింది.

ముఖం కడుక్కొని వచ్చి బట్టలు మార్చుకొని, క్రాపు సరిచేసుకొని తయారయ్యాను. ప్రదర్శనకు రెడీ అయిన బొమ్మలాగా. పెన్ తీసి జేబులో వుంచుకొని మామయ్య దగ్గరికి వెళ్ళాను. వస్తానంటూ లేచారాయన. ఇద్దరం బయలుదేరాము. డ్రైవరు స్టార్ట్ చేశాడు. మామయ్య ముందు కూర్చున్నాడు. నేను వెనుకసీట్లో కూర్చున్నాను బండికదిలింది.

ఇంతకు ముందే పెండ్లిచూపులకు వెళ్లి వచ్చాను. అక్కడ నేనుగనక ఊఁ అని అన్నట్లయితే పరిస్థితిఎలా

వుండేది! ఎందుకో నాకా అమ్మాయి నచ్చలేదు మరి! ఇంటికి వెళ్ళి వుత్తరం వ్రాస్తామండీ అని వచ్చేశాము. ఈ మాటతో మా అభిప్రాయం తెలుసుకొని వుంటారు బహుశా...!

మనోరమను నాకివ్వడానికి దోహదమిచ్చిన పరిస్థితులేవో కొత్తగా ఏర్పడివుండాలి! లేకపోతే నాకీ ఛాన్సు తగిలేదిగాదు. నేను మనోరమను హృదయపూర్వకంగా సంతోషంతో స్వీకరించగలను.

నేను అప్పట్లో ఒక భాగ్యవంతుడుగా వుండి వుంటే తప్పకుండా ఆమెను ప్రేమించే వుండేవాణ్ణి. ఆమెను ఆకర్షించడానికి సర్వవిధాలాయత్నించి వుండేవాణ్ణి. నా దరిద్రం మాత్రమే ఆమెను నాకు దూరం చేస్తూ వచ్చింది. ఈనాడు అయాచితంగా 'అదృష్ట'మనే అందాలరాణి నన్ను వరిస్తోంది. ఇందుకు కారణాలు ఏవైనా కానీగాక, మనోరమను వరించి తీరుతాను.........!

ఈ నిశ్చయానికి వచ్చేసరికి మనోరమ సుందరమూర్తి నా హృదయ ఫలకంపై నృత్యం చేయనారంభించింది. ఆమె నడకలో, కదలికలో, ఆమె కట్టే సన్నటిచీరలో ... ఆమె నయనాల్లో ఆ ముఖంలో ఆ చిలిపినవ్వులో ..ఆమె సహజమైన కలుపుగోలుతనంలో, నిష్కాపట్యంలో, నిగర్వమైన సంభాషణలో, నిరాడంబరనడవడిలో నాకు అందం గోచరించింది; ఆకర్షణాకనిపించింది. అదివరకు ఆమె రూపురేఖల్ని గూర్చి నేను ఆలోచించలేదు. ఇప్పుడు ఆలోచించవలసిన తరుణం వచ్చింది గనుక హృదయం ఊయలలూగింది. చల్లగా మెల్లగా గగన వీధిలో విహరింపసాగింది.

మనోరమను చూచి చాల కాలమైంది. అప్పటికే వికసించి, వికశిస్తూన్న ఆమె యౌవన కుసుమం, నేడు ఇంకా వికసించి తన ఘుమఘుమల్ని వెదజల్లుతూ వుండవచ్చు. ఏమయినా నేను అదృష్టవంతుడననే భావం ఏమూలో వుద్భవించి నన్ను నుర్రూతలూగించింది. నేనా రోజుల్లోనే మనోరమను ప్రేమించి వుంటే, తప్పక ఆమె నా ప్రేమ మాలను స్వీకరించి నన్ను మనసారప్రేమించి, నన్నలరించి, ఇద్దరం ప్రేమికులుగా వివాహం చేసుకొని వుండేవారం! ఆమె నాపట్ల ప్రదర్శించిన వైఖరిని జ్ఞప్తికితెచ్చుకొంటే, అప్పడ్నుంచీ, ఆమె నన్ను ప్రేమిస్తూ వుండేమోనని కూడా అనిపించింది.

కారు ఆగింది.

“హల్లో రామం” అన్నప్పుడు మధుర స్వరం వినిపించింది. కిలకిలా నవ్వుతూ మనోరమ నా చేయి అందుకొని, ఆహ్వానించింది. అప్పుడు ఆమె చేయి వణకడం నేను గమనించాను. కారుదిగి ఆమెను వెంబడించాను. ఒక గదిలోకి తీసుకెళ్ళింది నన్ను.

చక్కగా అలంకరింపబడివుందా గది. నన్ను గదిలో కూర్చోబెట్టి బీరువానుంచి ఒక కవరు తీసింది. ఆ కవరు ఆమెచేతికి తీసుకొన్నప్పుడు, ఆమె ముఖాన్ని సిగ్గుదొంతరలు కప్పివేసినయ్. కవరును నా ముందుంచింది. ఆమె కనుగొలకుల్లో ఎంచేతో అశ్రువులు నిండినయ్. కళ్ళలోకి చూశాను. ఆమెకళ్ళువాల్చి తలకూడావాల్చి కూర్చుంది. ఏదో పుస్తకం తీసుకొని ముఖానికి అడ్డంవుంచుకొంది. మధ్యలో ఒక పేజీతెరిచి చూస్తూవుంది. నేను తొందరపాటుచెంది, కవరుమీదిపేరు, నా పేరైవుంటంచూసి, కవరుతెరిచి అందులోని కాగితాలు తీశాను. అదొక వుత్తరం.

రామం !

అన్యదాభావించవద్దు. ప్రస్తుత పరిస్థితిలో నీ ఎదుట మాట్లాడలేకపోతున్నందుకు క్షమించాలి. నా హృదయం, గాయాలతో కూడివుంది. నీ మధుర వాక్కులు వింటేగాని ఆ గాయపడిన హృదయం ఆరోగ్యం పొందజాలదు.

నేను నిన్ను ఏనాటినుంచో ప్రేమిస్తున్నాను, నువ్వు గ్రహించలేకపోయావు. నీతో ఎంతో సన్నిహితంగా వుండాలని ప్రయత్నించాను. నువ్వు మాత్రం నీ వెవరో, నేనవరో అన్నట్లు, సాధ్యమయినంత దూరంగా వుండటానికే ప్రయత్నించావు. అందుకు కారణం - మానాన్న ప్రవర్తన అనికూడా నాకు తెలుసు. నిన్నూ, మీ కుటుంబాన్నీ కూడా

నాన్న ఇంతవరకూ చాల నీచభావంతో చూస్తూవున్నాడన్న విషయం వాస్తవమే. ఆయన తన సంపతిని చూసుకొని గర్వపడుతూ, సామాన్యుల్ని మరిచాడు. సామాన్యుల్లోకూడా రత్నాల్లాంటి వారుంటారనే విషయం ఆయనకు తెలియకపోయింది. నాకు ముఖ్యమైంది బంధుత్వంకాదు-నిన్నుగూర్చి, నీ వ్యక్తిత్వాన్నిగూర్చి నాకు బాగా తెలుసు. నేను తెలుసుకోగలగడం, నిజంగా అది నా అదృష్టం. ఆదినుంచీ నీ ప్రవర్తన చూస్తూనే వున్నాను. నువ్వు ఏనాడూ మా నాన్న ఆస్తిపాస్తులకు విలువయిచ్చి వుండలేదు. నీకు నిజంగా డబ్బుమీద కాంక్ష వున్నట్లయితే, నన్ను ఆకర్షించడానికి ప్రయత్నించివుండేవాడవు. నువ్వలా ప్రయత్నించనందుకే, నాకు నీ హృదయ పవిత్రత తెలిసివచ్చింది. నాకు నీ లాంటివాడే కావాలి. కేవలం మా నాన్న డబ్బుకు ఆశపడి, నన్ను పెళ్ళి చేసుకొనువారు, ఆ డబ్బు హరించిపోతే, నన్ను నీచంగా చూడవచ్చుగదా ?

నన్ను ప్రేమిస్తున్నట్లు ఎంతోమంది యువకులు నా ముందు నటించారు. సోదరులుగా నేనెంచిన ప్రతివాడూ నన్ను తమ ప్రేయసిగా చేసుకోజూశారు. ఆడది ఏమాత్రం చనువిచ్చినా, తదాధారంతో యువకులు ఎంత నీచానికి పూనుకొంటారో నేను బాగా తెలుసుకోగలిగాను. అయినా ఆ విషయాన్ని బహిరంగపరచకుండా, కాస్త జాగ్రతగా మెలగుతూ, మామూలుగానే వుంటూ వచ్చాను.

నాకు పెళ్ళిచేయాలన్నాడు నాన్న. రామాన్ని తప్పించి మరొకర్ని చేసుకోలేనని చెప్పాను. ఆయన ఆపాదమస్తకం కంపించిపోయాడు. అమ్మకూడా అసహ్యపడింది.

"అలాంటి దరిద్రునికి నిన్ను కట్టబెడుతామా" అన్నాడు నాన్న కోపంగా.

"ఇదంతా వాడిపన్నాగమే. లేకపోతే యిది వాణ్ణి కట్టుక ఏడుస్తాననటుందా ?" అంది అమ్మ. ఇద్దరూ నన్ను తెగదూషించారు. ఎవరో ఒక ఇంజనీరుకు ఇచ్చి చేస్తానన్నాడు నాన్న. నేను చేసుకోనన్నాను. చచ్చినట్లు చేసుకతీరాలన్నాడు. "పెళ్ళి చేసుకోవడం నేనుగానీ మీరుకాదని" గట్టిగా చెప్పాను. దానితో మహాకోపం వచ్చిందాయనకు. నన్ను నోటికొచ్చినట్లల్లా తిట్టాడు.
నేను మన పొట్టి శ్రీరాములుగారిలా గాని రాహారవ్రతం పూనేశాను. అమ్మ నా మీద అప్పటికి సానుభూతి చూపించింది. నాన్నను అంగీకరింపజేసింది.

రామం ! నువ్వు తప్పక, అంగీకరించగలవనే విశ్వాసం నాకువుంది గనకనే, నేను ధైర్యంగా ఇంట్లో పోరాడాను. నీ పవిత్ర హృదయానికి తలొగ్గుతాను.

కరుణించురామం !

మీ

'మనో'

ఉత్తరాన్ని అడ్డం తొలగించకుండా కొద్దిసేపు ఆలోచించాను. ఆమెతో ఎలా మాట్లాడాలో తోచలేదు.

"రామం" అన్న మనోరమ పలుకులతో ఉత్తరం దించి, తలెత్తి చూశాను. ఆతృతతో చూసింది నా ముఖంలోకి. "మనో ... " అన్నాను అప్రయత్నంగా నవ్వుతూ. ఆ నవ్వు నా కెలా వచ్చిందో... నాకే ఆశ్చర్యం.

"ఏమంటావ్ ? " మనోరమ ప్రశ్న.

"ఏమంటాను ... నీ లాంటి అందాలరాణి, అయాచితంగా..."

"రామం!" అంటూ వచ్చి నా మెడ కౌగలించుకొంది. దగ్గరకు లాక్కుంటూ వుండగా ఆవరణలో కోయిల జయగీతి పాడింది.

# ఏటి గట్టు

శ్రీ చల్లా లక్ష్మీనరసింహశాస్త్రి

ఏటి గట్టున ఎవ్వ
రాడుకొంటున్నారో
పాల నీళ్ళల్లోన
పాడుకొంటున్నారో!
పండువెన్నెల నెవరు
పవ్వళించినవారో
కలువ పూవన్నెలో
కలిసి పోయిన వారో!
ఏటి గట్టున...

ఆకాశ చుక్కలతో
ఆడుకుంటుందేమొ
లోకాల కోయిలతో
పాడు కుంటుందేమొ
ఏటి గట్టున...

పుష్ప సౌరభమంత
పూచి తొడిగిందేమొ
భావరూపంబంత
ప్రసరించి యుందేమొ!
ఏటి గట్టున...

కాల మానము తెలియ
కాచి యుండెడినేమొ
మూల రూపము దెలియ
మోహించి యుందేమొ!
ఏటి గట్టున...

# బాలల కళా నైపుణ్యాన్ని వృద్ధిచెయ్యగల సాధనాలు

నార్మన్ స్మిత్

సొంపైన భవనాలను, ఆకర్షణీయమైన ఫర్నిచరును, నిర్మించి, తద్వారా మానవుల జీవితం మరింత ఆహ్లాదకరంగా వుండేటట్లు చేయడం పట్ల మామూలుగా శ్రద్ధ వహిస్తూవుండే అమెరికన్ నిపుణులు ఇటీవల, పిల్లల జీవితాలను తేజోమయం చేసే విషయంలో తమ శక్తి సామర్థ్యాలను వినియోగిస్తున్నారు.

పిల్లలకు ఉత్సాహాన్ని, సంతోషాన్ని చేకూర్చడం మాత్రమే కాక, కళయొక్క ప్రాథమిక విషయాలతో వారికి పరిచయం ఏర్పరచగల ఆట బొమ్మలను వారు కనిపెడుతున్నారు. ఇళ్లు కట్టడానికి ఉపయోగించే కొయ్య దిమ్మలను ఒక దానిపైన మరొకటి పేర్చడానికి అవసరమయ్యే సాంకేతిక విధానాలతో దాదాపు తుల్యమైన విధానాలను ఉపయోగించి ఈ కళాకారులు కొత్త బొమ్మలను తయారుచేశారు. రంగుల విషయంలోను, కూర్పు విషయంలోను, పిల్లలు తమ కళాభిరుచిని వ్యక్తంచేయడానికి వీలు కల్పించేటటువంటివి ఈ బొమ్మలు.

వర్షాకాలంలో, కేవలం ఇంట్లో తయారుచేయబడిన గుడ్డ బొమ్మలతో పిల్లలు ఆడుకుంటూ బయట వర్షంలో తడవకుండా వుండేటట్లు చేయడం ఎలాగని భయపడుతూ వుండే పిల్లలతల్లులు "మేగ్నెట్ మాస్టర్" అనే ఆటబొమ్మను కనిపెట్టిన ఆర్థర్ కెర్రారాను తప్పక అభినందిస్తారు.

ఈ యువ కళాకారుడు షికాగో వాస్తవ్యుడు. కొత్త వస్తువులు కనిపెట్టడం కెర్రారా అభిమాన విషయం. ఈయనకు సంగీతం, పెయింటింగు, ఎలెక్ట్రానిక్స్‌లయందుకూడా అంత అభిరుచివుంది. అయస్కాంతాలతో కొన్ని సంవత్సరాలుగా ఈయన పరిశోధనలు జరుపుతున్నారు. అయస్కాంతపు ఆకర్షణ తనకు చిన్నప్పుడు అత్యంత సంభ్రమాశ్చర్యాలు కలిగించినట్లు ఆయనకు గుర్తువుంది. అందువల్ల, పిల్లలు ఆడుకునే బొమ్మ నొకదానిని తయారుచేయడానికి దాని నుపయోగించాలని ఈయన నిశ్చయించుకున్నాడు.

ఈ ఆలోచనను ఆచరణలో పెట్టడం ప్రారంభించినప్పుడు, ఎలెక్ట్రానిక్స్ పట్ల ఈయన శ్రద్ధ ఎంత బలీయంగావుందో, కళాదృష్టి డిజైనుల పట్ల శ్రద్ధ కూడా ఆయనలో అంత బలీయంగానువుంది. కన్ను చెదిరే రంగులు, రకరకాల దిమ్మలు - నలుచదరపువి, ముక్కోణాకారంవి, గుండ్రనివి - ఉపయోగించాలని ఆయన అనుకున్నాడు. చిన్న అయస్కాంతాలవల్ల అంటిపట్టుకునివుండే ఈ దిమ్మలను అనేక విధాల కూర్చవచ్చు. వీటిని అమర్చే పద్ధతికూడా అత్యంత సునిశితమైనది.

పిల్లలు తమ కళాభిరుచిని వ్యక్తంచేయడానికి ఇది ఎంతో తోడ్పడగలదని కెర్రారా విశ్వసిస్తున్నారు. ఈయన ఇలా వివరించారు. "ఏయే రంగు దిమ్మలను ఏయే విధంగా కూర్చాలనుకుంటే అలా యథేచ్ఛగా కూర్చవచ్చు. ఇందుకు జిగురును గాని, మేకులనుగాని పిల్లలు వాడనవసరమే లేదు. మళ్లీ మళ్లీ రంగులను పూస్తూవుండ నవసరంకూడా లేదు. అందువల్ల, కూర్పును మార్చాలంటే దిమ్మలను అటూ ఇటూ కదిలిస్తేచాలు."

శిల్పులు, కళాకారులు తమ పిల్లలంతగాను ఆట బొమ్మల పట్ల విశేషమైన శ్రద్ధాసక్తులు చూపుతున్నారు. నోరిస్ జాన్సన్, డోశా ఆర్నాల్డ్‌ల వంటి శిల్పులు ఈ ఆట బొమ్మలతో కొన్ని ఆకర్షవంతమైన సంక్షేపరూపాలను కూర్చారు. ఇటువంటి వాటికి తీగె తెర, గుడ్డ, సూదులు, రంగు కాగితం వగైరాలనుకూడా మిస్ ఆర్నాల్డ్ ఉపయోగించింది.

అమెరికాలోని ప్రముఖ చిత్రకారులలో ఒకడైన మాక్స్ వెటర్ ఈ ఆట బొమ్మను చూడడం తటస్థించింది. ఆయన దృష్టిని ఈ బొమ్మ విశేషంగా ఆకర్షించింది. దీనిని గురించి ఆయన ఇలా అన్నారు. "వీటివల్ల పిల్లలకు ప్రాథమికమైన రేఖా చిత్రాలతో పరిచయమేర్పడుతుంది. వాటితో ఆడుకోవడంవల్ల పిల్లలు తమకు తెలియకుండానే నిగూఢమయిన కళా

ప్రపంచంలో ప్రవేశిస్తారు. కళయొక్క ముఖ్య లక్షణాలైన అవయవాను రూపత్వం, సమస్థితి మొదలైనవాటిని గురించి కులాసాగా ఆటపాటలలో నేర్చుకుంటారు.

అయస్కాంతంతో ఇంకా విచిత్రమైన ఆట వస్తువును ఒకదానిని కెరార్డ్రా తయారుచేశారు. ఇది అయస్కాంత శక్తికల ఒక బల్ల. దీనితోపాటు చిన్న చిన్న లోహపు ముక్కలు అనేక సైజులవి, అనేక రూపాలవి, అనేక రంగులవి, వున్నాయి. ఈ లోహపు ముక్కలను పిల్లలు అయస్కాంత శక్తికల బల్లకు తాకించగానే అవి అతుక్కుపోతాయి. ఈ విధంగా పిల్లలు ఈ లోహపు ముక్కలలో తమ సృజనాత్మకశక్తి నుపయోగించి రకరకాల స్వరూపాలను రూపమివ్వవచ్చు.

ఆట బొమ్మలు తయారుచేయడానికి ఇటీవల పూనుకున్న వ్యక్తులలో చార్లెస్ ఒకరు. ఈయన శిల్పి, డిజైనుల నిర్మాత. ప్లాస్టిక్ ఫర్నిచరు తయారు చేయడంద్వారాను, పోత కొయ్య సామానులు తయారుచేయ్యడం ద్వారాను ఈయన విశేషప్రఖ్యాతి గాంచారు. ఈ సామానులు ఈ నాడు అమెరికాల్లో లక్షలకొద్దీమంది, ఇళ్ళలో వాడబడుతున్నాయి. "హౌస్ ఆఫ్ కార్డ్స్" అనే ఆటబొమ్మను ఈయన తయారుచేశారు. ఇందులో అన్నీ చిత్రవిచిత్రమైన రంగులుగల చిన్నచిన్న కొయ్య ముక్కలుగాని ప్లాస్టిక్ ముక్కలు వుంటాయి. ఇవి అంచుల వెంట వొకదానితో మరొకటి సంధింపబడి వుంటాయి. వీటిని ఒకదానిని మరొకదానితో లంకెపెట్టి అనేకమైన స్వరూపాలను సృష్టించవచ్చు.

పిల్లలకు కళల పట్ల శ్రద్ధ కలిగించడానికి ఎల్లప్పుడూ శ్రద్ధ వహించే అభ్యుదయ కళా ప్రదర్శనాలయాలు కొన్నికూడా ఇటీవల ఆట బొమ్మలవైపు తమ దృష్టిని సారించాయి. బాల్టిమోర్ కళా ప్రదర్శనాలయంవారు "పిల్లల సృజనాత్మకమైన ఆటబొమ్మల" ప్రదర్శనాన్ని ఇటీవల ఏర్పాటు చేశారు. ఇది చాల విజయవంతంగా జరిగి, పిల్లలకు దీనిని ఏర్పాటు చేసిన ప్రదర్శనాలయోద్యోగులకుకూడా ఎంతో సంతృప్తిని చేకూర్చింది.

ఈ ఆట వస్తువులతో పిల్లలు ప్రతిసాయంత్రం ఒక గంట సేపు ఆడుకునేటందుకు అనుమతించబడింది. ఇక్కడ ప్రదర్శించబడ్డ సృజనాత్మకమైన ఆట బొమ్మలతో ఆడుకొనవలసిందని వారిని ప్రోత్సహించడం కూడా జరిగింది. అయస్కాంతపు ఆట బొమ్మలు పిల్లల దృష్టిని విశేషంగా ఆకర్షించాయి. "స్కల్ప్చర్డ్ ప్లే పీపుల్" అనే మరొక ఆట బొమ్మ బాలికల దృష్టిని ప్రత్యేకంగా ఆకర్షించింది. ఈ బొమ్మలు ఎంతో మృదువుగా వుండి, పిల్లలు స్పృశించడానికి ఎంతో బాగున్నాయి. ఇవన్ని దాదాపు సాంకేతిక రూపాలు మాత్రమే. ఇవి కొంతవరకు హెన్రీ మూర్ శిల్పాలలాగా వున్నాయి. ఈ బొమ్మల ఆకారమంతా తీర్చి దిద్దినట్లు చేయకుండా ఉంది. ఉద్దేశపూర్వకంగానే పిల్లలు ఇష్టం వచ్చినట్లు వీలైనన్ని విధాల ఆలోచించి, వారు ఇంకా అటువంటి వాటిని అనేకం సృష్టించడానికి వీలుగా ఇలాచేయడం జరిగింది.

న్యూయార్కు నవకళా ప్రదర్శనాలయానికి చెందిన విక్టర్ డి ఎమికో అనే ఆయన "కలర్డ్ ప్లేయర్" అనే ఆటవస్తువును ఒకదానిని తయారు చేశారు. విద్యుత్కాంతి ప్రేరణ సహాయంతో పనిచేసే అసాధారణమైన ఆట బొమ్మ ఇది. ఈ బొమ్మలో తొక్కుడు హార్మోనియంలాంటి సాధనం ఒకటివుంది. దానికి నాలుమెట్లు, రెండు తొక్కుడు బల్లలు వున్నాయి. కాళ్లతో ఈ బల్లలను తొక్కుతూ, చేతి వేళ్ళతో మెట్లను ఒకటొకటిగా గాని, కొన్నిటిని కలిపిగాని పిల్లవాడు నొక్కుతూవుంటే, అతడికి ముందున్న తెరపైన అనేక రంగులలో అనేక డిజైనులు కదలాడుతూ వుంటాయి.

ఆ విధంగా, వివిధమైన స్థాయిలలో కళ ఎలా వుండగలదో, ఎలా వుందో మనం చూస్తున్నాం. వివిధమైన రంగు ముక్కల తోను, అయస్కాంతీకృతమైన లోహపు ఆకారాలతోను చిన్నప్పుడు ఆడుకున్న కారణంగా సృజనాత్మక శక్తి జాగరితమైన కళాకారుడెవరైనా సృష్టించిన కళాఖండాన్ని చూచి తర్వాలోనే ఒకనాడు ప్రపంచంపరవశం పొందగలదేమో ఎవరికి తెలుసు?

—o—




# మంత్ర ప్రభావం

శ్రీమతి వే. వినత

అనగ అనగా ఒక ఊళ్లో ఒక పండితుడు వుండే వాడు. ఆయన పేరు జంఝూల శాస్త్రి. మన జంఝూల శాస్త్రి చాలా తెలివిగల వాడు. గొప్ప పండితుడు కూడా. ఆయనకు రాని విద్య అంటూ వుండేదికాదు. ఆయన కేవలం పండితుడే కాక గాలీ, ధూళీ, వగైరాలనుకూడా పోగొట్టేవాడు. అసలు వాటికి మన శాస్త్రిగారిని చూస్తేనే భయం. ఆయనకు ఒక కూతురుకూడా వుండేది. ఆవిడ పేరు "లీల"

ఇట్లా వుంటూవుండగా ఒక రోజున రాత్రి మన జంఝూల శాస్త్రిగారి ఇంట్లో దొంగలు పట్టారు. అర్ధరాత్రి పన్నెండు గంటలకు అందరూ మంచి నిద్ర పోతున్నారు. కానీ లీల మాత్రము మెళుకువగానే వుంది ఆవేళ ఎందుకో. దొంగలు రావడము, తలుపుకు కన్నం వేసి దూరడము అంతా చూస్తూనే వుంది. మెల్లిగా అలమారులో వున్న తాళం చెవులు తీసి, ఇనప్పెట్టెలోవున్న డబ్బు, వెండిసామాను తీసుకుని, సరాసరి మన లీలదగ్గరకు వచ్చి, నగలు యియ్యమని అడిగారు, యేముంది లీలకు పైప్రాణాలు పైకి పోయినాయి. వణుకుతున్న చేతులతో చంద్రహారం తీసియిచ్చేసింది. అది తీసుకుని వెళ్లిపోతూ, మేము వెళ్ళేదాకా. అరవవద్దని, అరిస్తే వచ్చి చంపుతామనీ చెప్పి వెళ్ళిపోయారు అక్కడనుంచి. నాన్న! దొంగలు దొంగలు అని కేకలు పెట్టింది లీల మెల్లిగా. అది విని జంఝూల శాస్త్రిగారికి మెళుకువవచ్చింది. కూతురు భయపడి కలవరిస్తోందని, దగ్గరకు వచ్చి కూచుని వొళ్ళంతారాస్తూ, ఆంజనేయుని స్తోత్రం చెయ్యడము మొదలు పెట్టాడు. "లీల"కు నోట మాట రావడములేదు. గట్టిగా అరిస్తే వాళ్ళువచ్చి చంపుతారని భయం. మనశాస్త్రిగారు అమ్మాయి బాగా భయపడ్డదని, గట్టిగా మంత్రాలు చదవడము ప్రారంభించాడు. దొంగలు వెళ్లిపోయి వుంటారీ పాటికీ అనుకొని "నాన్నా, దొంగలు నిజంగా వచ్చారు. ఇనప్పెట్టిలో డబ్బు అంతా ఎత్తుకు పోయారు, "అని చెప్పింది. అప్పుడు మన జంఝూల శాస్త్రిగారు చూచుకుంటే యేముంది? అంతా ఖాళీ.

చూచారా బాలలూ? మన జంఝూల శాస్త్రిగారి మంత్రప్రభావం!

# తగిన శాస్తి

భాగవతుల సుబ్బారావు

ఒకానొకప్పుడు, ఒక వూళ్ళో, ఒక బీద బ్రాహ్మణుడు నివసించుచుండెడివాడు. జీవితం గడపటం అతనికి చాల కష్టతరమైంది. దీనికితోడు, అతనికి వివాహము చేసుకొనవలయునని బుద్ధిపుట్టింది. మరి వివాహమంటే మాటలా? అందులో బీద

వాడుగూడ. ఆ వూళ్ళోనే యున్న ధనంవంతుల వద్దకు వెళ్ళి, తనకు వివాహము చేసుకొనవలయునని ఆశగలైననియు, తన వద్ద ధనంలేని కారణాన, తనకు ఏదైనా సహాయము చేయవలయునని బ్రతిమిలాడాడు. చివరికి ఎట్లాగో ధనంసంపాదించి, వివాహం చేసుకున్నాడు. భార్యను, ముసలి తల్లిని యింటికి తెచ్చుకున్నాడు. కాని భుక్తి ఎట్లాగడుస్తుంది? ఏదోవిధంగా డబ్బు సంపాదించవలయునని బుద్ధిపుట్టింది. ఇక ఆ వూళ్ళోనేవుంటే లాభంలేదనుకొని దూరదేశం వెళ్ళి డబ్బు సంపాదించాలనుకున్నాడు. అనుకున్న ప్రకారంగా, తల్లి వద్ద కెళ్ళి, "అమ్మా నిన్ను, నా భార్యను పోషించటానికి నా దగ్గర డబ్బు ఏమిలేదు. రోజులు గడవటం కష్టంగావుంది. మరి ఏదో విధంగా నేను డబ్బు సంపాదిస్తేగాని గడవదు అందుకని నేను దూరదేశం వెళ్ళి మనకు సరిపోయినంత డబ్బు సంపాదిస్తేగాని యింటికి రాకూడదని నిశ్చయించుకున్నాను అప్పటిదాకా నా దగ్గర వున్న కొద్ది డబ్బుయిస్తాను. దానితో, మీరు ఎట్లాగో గడుపుకొని, నా భార్యను జాగ్రత్తగా చూస్తూవుండు" అని అన్నాడు. ఆ బ్రాహ్మణుడు తల్లి దీవెన పొంది వెంటనే ప్రయాణమై బయలు దేరి వెళ్ళాడు.

ఆ వూరిలో ఒక దయ్యం తిరగుతూ వుండేది. అది, ఎవరైనాయింటికి యజమానిలేని సమయము చూచి సరిగ్గా, ఆ యింటి యజమాని వేషంతోవచ్చి, వారిని, నానా బాధలు పెడుతూవుండేది. చివరికి తగిన శిక్ష అనుభవిస్తూవుండేది. ఇప్పట్లో ఈ బ్రాహ్మణుడు యికరాడనుకొని సరిగ్గా అతని వేషం వేసుకొని, ఆ యింటికి వెళ్ళింది. కొత్తగా పెళ్ళి చేసుకున్న ఆ యువతి, అతను నిజంగా తనభర్తే అనుకొని. "అదేమిటండీ అప్పుడేవచ్చారు కొన్ని సంవత్సరాలదాకా రానని; ప్రొద్దున్నేగా మీరు చెప్పారు. అప్పుడేమనసు ఎందుకు మార్చుకున్నారు." అన్నది. అప్పుడా దయ్యము "ఇవ్వాళమంచిరోజు కాదు అదీగాక నావద్దకొద్దిగా డబ్బు వుంది" అని అన్నాడు.

ఆ తల్లి గూడ, నిజంగానే నమ్మింది. తనే ఆయింటికి యజమానిలాగా, ఆముసలి స్త్రీకి కొడుకులాగా, ఆ పిల్లకు భర్తలాగా వుంటూ కాలము గడుపుతున్నాడు. ప్రతి విషయంలో ఆ బీద బ్రాహ్మణుడు, ఆ దయ్యం ఒకే మాదిరిగా వుంటడంవల్ల, యిరుగు పొరుగువారు గూడా, అతను నిజమైన బ్రాహ్మణుడనే అనుకుంటున్నారు. ఈ విధముగా వుంటూ వుండగా, ఆ బ్రాహ్మణుడు, కొద్దికాలం తరువాత తిరిగి వచ్చాడు. తన మాదిరిగానే యింకొక బ్రాహ్మణుడు యింట్లో వుండటం చూచి

(1116 పేజీ చూడుడు)

(1114 పేజీ తరువాయి)

ఆశ్చర్యపడ్డాడు. ఆ దయ్యము, బ్రాహ్మణుడితో "ఎవరు నువ్వు? నాయింటికి ఎందుకు వచ్చావు?" అని ప్రశ్నించాడు.

"నేనెవరినా! ముందర నీవెవరో చెప్పు. ఇది నా యిల్లు. ఆమె నా తల్లి, ఈమె నా భార్య" అని సమాధానమిచ్చాడు.

"ఏమిటయ్యా విచిత్రంగా మాట్లాడుతున్నావు. ఈ చుట్టు పక్కల అందరికీ తెలుసు వీళ్లు నావాళ్లని. ఎక్కడి నుంచో వచ్చి, వీళ్లు అంతానావాళ్లు, ఇది నాయిల్లు అంటావు. నీకు తల తిరుగుతున్నట్లువుందే, పద బయటికి నడు" అంటూ ఒక్కతోపు తోశాడు ఆబ్రాహ్మణ్ణి, ఆ దయ్యము పాపం ఆ బ్రాహ్మణుడు తిరిగి తిరిగి పిచ్చివాడై పోయినాడు. చివరికి ఆ దేశపురాజు వద్దకి వెళ్లి, తన కథ వివరించి చెప్పాడు. రాజు యిద్దర్ని పరీక్షించాడు. కాని వారి పోలికలు రెండు ఒక్కటైన కారణాన ఏమియు చెప్పలేక రేపు రమ్మన్నాడు ఈ విధంగా "రేపురా" అంటూ ఆ బ్రాహ్మణ్ణి పాపం ఆ రాజు తిప్పుతున్నాడు. ఏమి చేయటానికి తోచక, నెత్తిబాదుకుంటూ, "వీడు ఎటువంటిరాజు! న్యాయం చెయ్యడు. ఎంత దుర్మార్గపు ప్రపంచము—నా స్వంత యింటినుండి నేను తరిమివేయబడ్డాను – మరియు ఇంకొకడు నా స్వంత యింటిని నా భార్యను స్వాధీన పర్చుకున్నాడు" అని అనుకుంటూ వుండేవాడు.

ఈ విధంగా, ఆ బ్రాహ్మణుడు, రాజు వద్దనుండి, తిరిగి యింటికివస్తూ పొలాల వెంబడి వెళ్తూన్నప్పుడు, అక్కడ వున్న గొడ్లకాపరులు ఇతనిదీనస్థితి చూచి విచారించారు. ఒక రోజు, ఆ కాపరులకు నాయకుడైన ఒక గొల్లవాడు, తన వద్దనున్న వారితో "ఆబ్రాహ్మణుడు రోజు ఏడుస్తూ వెళ్తూవుంటాడు. కారణమేమిటి?" అని అడిగాడు.

తమకు ఏమియు తెలీదన్నారు.

"సరే అతనిని పిలుచుకురా, సంగతేమిటో అడుగుదాము" అని అన్నాడు నాయకుడు.

ఆ బ్రాహ్మణుడు మొదటినుంచి చివరి వరకు జరిగినది వివరించి చెప్పాడు. "సరే నీ విషయము అర్థమైంది. నీవు రాజువద్ద కెళ్లి నీ విచారణ జరిపించటానికి అనుజ్ఞ తీసుకొనిరా" అని అన్నాడు నాయకుడు.

ఏమి చేయటానికి తోచక విచారముతో నున్న ఆ రాజు వెంటనే ఆజ్ఞ యిచ్చాడు. మరునటి రోజున విచారణ వాయిదా పడ్డది.

ఇదంతయు తెలిసిన ఆ గొల్ల నాయకుడు తనతో ఒక సన్నని మూతిగల సీసాగూడ తీసికొని వచ్చాడు. విచారణ స్థలమువద్దకు ఆ యిద్దరు బ్రాహ్మణులు వచ్చారు. సాక్ష్యములు, ఉపన్యాసములు

విన్నతరువాత, ఆ నాయకుడు – "మంచిది, అంతయువిన్నాను. తక్షణమే విచారణ జరిపిస్తాను. ఇది ఒక గాజుసీసా మీలో ఎవరైతే ఈ సీసాలో దూరుతారో న్యాయం ప్రకారంగా అతనే ఆ యింటికి యజమాని. ఇప్పుడు ఎవరు దూరగలరో నన్ను చూడనీండి" అని అన్నాడు.

"నీవు గొల్ల కాపరివి నీ తెలివిగూడ ఆ విధంగానే యున్నది. ఏమిటి – ఎవరైనా మానవుడు ఆ చిన్న సీసాలో దూరుతాడా?" అని బ్రాహ్మణుడు ప్రశ్నించాడు.

"ఒక వేళ నీవు దాంట్లోదూర లేకుంటే నీవు హక్కు గల యజమానివి కావు" అని సమాధానమిచ్చాడు నాయకుడు. దయ్యము వైపుతిరిగి "అయ్యా దీనికి మీరేమంటారు? ఒకవేళ మీరు దూరగలరైతే, అప్పుడు ఆ యిల్లు, ఆ భార్య, ఆ తల్లి, సర్వం మీదౌతుంది" అని అన్నాడు.

"బహుశా నేను దూరగలను" అని దయ్యమన్నాడు. ఆ మాటప్రకారంగానే అందరికి ఆశ్చర్యమయ్యేటట్లు ఒక చిన్న పురుగుగా మారి, ఆ గాజు సీసాలోకి దూరాడు. వెంటనే ఆ గొల్లనాయకుడు, బిరడాతో దాని మూతిని బిగించివేశాడు. ఇక ఆ దయ్యం బయటికి రాలేకపోయింది.

అప్పుడు బ్రాహ్మణుని వైపు తిరిగి ఆ నాయకుడు "ఈ సీసాను సముద్రంలోపారవేసి, నీ యింటిని, తల్లిని, భార్యను, స్వాధీనపరుచుకో" అని అన్నాడు. ఆ ప్రకారముగానే బ్రాహ్మణుడు చేసి, కొడుకులు కూతుళ్లతో చాల సంవత్సరములు జీవించాడు.

(1074 పేజీ తరువాయి)

ఈమె వ్రాసిన ఈ "తెల్లరోజా" ఆ దేశంలో ప్రతివారూ చదువుతూ, ఆ రోజుల్లో తమ క్షేమమాత్రం తెలుసుకోడానికి అవకాశాలులేని ఎన్నో విషయాల్ని అర్థం చేసుకొంటూ ధన్యులవుతున్నారు. ఈ గ్రంథంలో ఈమె ఎవరినీ దూషించదు. తమ దేశపు అసహాయస్థితిని చూస్తూ విచారిస్తుంది. దేశం ఆ అయోమయాన్నుంచి కుదటబడ్డాక ఆనందిస్తుంది. రాజమార్గానే ప్రజాకోటీ తటపటాయించక ముందంజ వేస్తూ, దేశకల్యాణానికి, లోకశాంతికీ అహోరాత్రాలు సేవచేస్తూ పరమపావనం అవాలని వుర్రూతలాడుతుంది.

ఈ "తెల్లరోజా"ని ఈ మధ్య జర్మను దేశంలోవున్న కాలాన చదివే అదృష్ట భాగ్యం నాకు లభించింది. దాన్నే మన వారికి సమర్పించడానికి తెలుగులో అనువాదంచేసే అవకాశాన్ని నేడు నాకు "గృహలక్ష్మి" సంపాదకులు ప్రసాదించారు. ఇందులకు వారికెంతో కృతజ్ఞుణ్ణి. దీనిని నా దేశీయులు చదివి ఆనందిస్తారనీ, తద్వారా జర్మను దేశపు యీ వీర వాతావరణాన్ని గ్రాహ్యం చేసుకొనగలరని నా ఆశ. నా ఆదర్శం. అదే కొనసాగిందా! నేనిక వాంఛించాలసింది మరేంవుంది!]

అది యుద్ధకాలం. భరింపరానిచలి. ఎక్కడ చూసినా మంచు. ఫిబ్రవరి మాసం ప్రారంభమయింది. దేశంలోపల యుద్ధాగ్ని జ్వాలలు. దేశంబయటా ఈ పెను భూతాలు మానవ జీవితాన్ని పీల్చి పిప్పి చేస్తూవున్నాయి. అట్టి విషమావస్థలో జీవకోటికి శాంతి ఎలావుంటుంది! అది యెప్పుడో మటుమాయమైపోయింది. రష్యను యుద్ధరంగంలో విషవాయువులు యథేచ్ఛగా వీవసాగాయి. స్టాలిన్ గ్రాడులో అప్పుడు జరుగుతూవున్న యుద్ధనాదాల్ని వింటే గుండెలు గభీలుమని కొట్టుకుంటాయి ... ఆ పరిస్థితుల్లోనే మ్యూన్‌షన్ నగరానికి సమీపానవున్న ఒక పట్నంనుంచి మరో వూరికి రైలుబండిలో ప్రయాణంచేయవలసివచ్చింది. మా పెట్టెలోనే నాజీ పార్టీ సభ్యులు కొందరు కూర్చున్నారు. ఈ మధ్యనే మ్యూన్‌షన్ కోర్టులో జడ్జీలు రాజద్రోహ నేరం క్రింద విచారణ చేస్తున్న కుర్రవాళ్లను గురించే కబుర్లను చెప్పుకొంటున్నారు. నేను వినిపోతానని కాబోలు ఆ పెట్టెలోకి నేను రావడంచూసి ఆ కబుర్లు కట్టిపెట్టారు.

యూనివర్సిటి భవనం గోడలమీద పెద్ద అక్షరాలతో "హిట్లరు నశనం కావాలి" అని వ్రాయబడివుంది. ఏఇంటిముందు చూసినా, ఆ నగరంలో ఏదోవలో నడచినా కరపత్రాల్నే చూడవచ్చు. "ప్రజలారా! మీ రందరూ ఈ పెనుభూతాన్ని ప్రతిఘటించాలి. అలా చేయకపోతేగా దేశం అధోగతి పాలవుతుంది. మీరు దాంతో నాశనం అవుతారు" అనే వాక్యాలే ఈ కరపత్రాల్లో పెద్ద పెద్ద అక్షరాలతో ముద్రింపబడ్డాయి. దోవలో నడిచేవాళ్లు వాటిని చదివారు. ఇటూ అటూ చూస్తారు. అంతకన్నా వాళేం చేయగల్గుతారు! ఇన్ని కష్టాలను ఎదుర్కోవలసివచ్చినా జీవిత రథాన్ని యేదో విధంగా నడుపుకోవాలికదా! ఇంత అయోమయావస్థలో మునిగితేలుతూవున్నా యీ అసహాయస్థితిలో ఏమీ తమకు తెలియనట్లే నటిస్తూ నడుస్తూనే వున్నారు. కాని స్వాతంత్ర్యాగ్ని అందరి హృదయాలోను మండిపోతూనే ఉంది. దాని కనుగుణ్యంగా చేయవలసిన కార్యకలాపాన్నంతా రహస్యమార్గాలో జరుపుతూనే వున్నారు. ఇది కారు

చిచ్చు. అది మండేది సామాన్య ప్రజానీకంలోనే కాదు. సైనికుల్లో - అంతేనా - ఈ చిచ్చును ప్రపంచానికి తెచ్చిపెట్టిన నాజీపార్టీ సభ్యుల్లోనే భగభగ రేగిపోతూంది. కాని ఆ వేదన్ని బయటికి చెప్పుకొంటారా! ఈ ఇద్దరు సభ్యుల వైఖర్ని చూశాక, వీళ్లూ ఆ కోవకు చెందినవాళ్లే అని గుర్తించాను. నన్ను చూశాక, నేనూ ఆ పెట్టెలోకివచ్చి కూర్చున్నాక ఈ సంగతినే గుసగుసలాడడంలోకి మార్చారు. నేనూ ఏం తెలియనట్లు నటిస్తూ ఆ గుసగుసల్నే శ్రద్ధతో తలుపు దగ్గరే కూర్చుండి వింటున్నాను. ఆ ఆవేశంలో ఒకడు నేను వారి దగ్గరే కూర్చున్నాననే విషయాన్ని పూర్తిగా మరచిపోయి "యుద్ధం ముగియడానికి తొందరపడనక్కరలేదు. రేపో ఎల్లుండో తప్పక ముగుస్తుంది. తరువాతో? ఇంకేం వుంటుంది? సర్వనాశనం అంతే అంతే" అన్నాడు. రెండో మనిషి నా వంకే చూస్తూ స్తంభించిపోయాడు, బహుశా ఆ మాటను నేవింటే ఏం ప్రమాదం వస్తుందో అని కాబోలు. ... ఈ నగరంలో ఈ రోజుల్లో విచ్చలవిడిగా రేగిపోతున్న స్వాతంత్ర్య పోరాటం విషయం వాళ్ళకు తెలుసు. ఆ కేసు విషయం విన్నాక వాళ్ల వొళ్లూ మండిపోతూనేవుంది. కాని వాళ్లూ మానవమాత్రులే! దాన్ని నిరోధించడానికి అంత సులభసాధ్యమా?

కొన్నాళ్ళు గడిచిపోయాయి. జడ్జీలు ఆ ముగ్ర వాళ్ళ నేరాన్ని పూర్తిగా విచారించి తీర్పును ప్రకటించారు. అధికారులు ఈ తీర్పునే ఎర్ర అక్షరాలతో అచ్చేసి రహదారిస్థలాల్లో వూరివారందరికీ తెలియపర్చటానికి చేయవలసిన కట్టుదిట్టాలను చేశారు. ఆ అధికార ప్రకటనలో ఈ విధంగా ప్రకటించబడింది.

"రాజద్రోహ నేరంక్రింద ఈ క్రిందివారికి మరణశిక్ష విధించబడ్డది:

క్రీస్టోఫ్ ప్రోబ్స్ట్, వయస్సు 24 సం॥లు.

హాన్స్‌షోల్స్, వయస్సు 25 సం॥లు.

సోఫీ షోల్స్, వయస్సు 22 సం!!లు.

ఈ తీర్పు ప్రకారం ముగ్గురినీ వురి తీశారు."

ఆ నాడు ప్రచురింపబడ్డ దినపత్రికలు ఈ విషయాన్ని గురించే పెద్ద వ్యాసాలను వ్రాశాయి. 'ఈ ద్రోహులు దేశానికే అపకీర్తిని తెచ్చారు. దానికి తగిన శిక్షను అనుభవించినందుకు మన మందరం సంతోషించాలి. నేరస్థులనుబట్టి కోర్టువారికి వొప్పగించిన పోలీసు అధికారులు సంస్తవనీయులు. వారి సేవను దేశమెన్నటికిని మరువజాలదు.' ఇదే ఈ పత్రికల వ్రాతల ధోరణి. వార్తా పత్రికలు ప్రభుత్వం వారి అదుపాజ్ఞలలో నడుస్తున్నాయి. అంచేత పత్రికలకు మరో మార్గాన ఆ విషయాన్ని సూచించడానికి ధైర్య సాహసాలు ఎలా వుంటాయి?

(సశేషము)




**ఇతరుల ఎలా ఆకర్షించాలి? : శ్రీ సి హెచ్. ఆచార్య, ప్రచురణకర్తలు: నవప్రచురణ సమితి, C/o గోల్కొండ పత్రిక, హైద్రాబాద్ (ద). వెల 0-4-0.**

ఇందులో మానవుడు యితరుల నెలా ఆకర్షించడమనే విషయమును గురించి వివరిస్తూ అమూల్యమైన సలహాలిచ్చాడు గ్రంథకర్త. వానిలో ముఖ్యంగా మొదటిది యితరుల విమర్శించ కూడదనేది. తర్వాత కోరిక జనింప జేయడం, యితరులతో చర్చ పరిమితం చేసుకోడం, చిరునవ్వు ఆవశ్యకత, విచక్షణా దృష్టి, యితరుల పట్ల ఆసక్తిని ప్రదర్శించడం, యితరులను ప్రశంసించుట యితరుల తప్పు లెన్నకుండుట, ఆత్మ పరిశీలన యిత్యాదులు.

గ్రంథకర్త వాదాన్ని తూచాతప్పకుండా అంగీకరించినా లేకపోయినా యీ గ్రంథపఠనం ప్రతి యొక్కరికి సమరస సద్భావాలతో నలుగురిలో మెలగడానికి దారి చూపుతుందనడానికి సందేహము లేదు.

**శ్రీ వేంకటేశ్వరస్తోత్రము : శ్రీ కే. నారాయణరావు, ప్రకాశకులు : జయలక్ష్మి అండ్ కంపెని, ట్రంక్ రోడ్డు, నెల్లూరు.**

ఇందులో శ్రీ వేంకటేశ్వరస్తోత్రముతో బాటు శ్రీ వేంకటేశప్రపత్తి, శ్రీ వేంకటేశ మంగళాశాసనములు మూలశ్లోకములతో బాటు ఆంధ్రీకరించబడి కూర్చబడినవి. భక్తి పారవశ్యంతో స్మరించడానికి స్తోత్రంచేయడానికనువుగా గ్రంథకర్త రచన నెరపినాడు.

**శ్రీకృష్ణుని గీతావాణి : శ్రీ వి. కృష్ణారావు, అరుట్ల పోస్టు, ఇబ్రాహింపట్నం తాలూకా, హైద్రాబాద్ (ద) వెల 0-8-0.**

ఇందులో గ్రంథకర్త తన భార్యకు భగవద్గీతా తత్వాన్ని బోధించిన లేఖలున్నవి. చిన్నచిన్న తొమ్మిది లేఖలలో భగవద్గీతా సారాన్ని వివరించ గ్రంథకర్త పూనుకోడం సాహసమే అయినా శ్రీకృష్ణుని జీవితముతో ప్రారంభించి, రజోగుణ తమోగుణ ప్రాంతములవరకు వివరించడంలో శక్తి వంచన లేకుండా కృషి చేశాడు. ఇలాంటి చిన్న చిన్న లేఖల రూపంలో భగవద్గీతలాంటి ఉద్గ్రంథ వివరణ ప్రోత్సహించతగినది, అభిమానించవలసినది.

**హృదయేశ్వరి : శ్రీ తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి, సాహితీ సమితి, రేపల్లె. వెల రు. 1-8-0.**

ఇది రసవంతమైన పద్యకావ్యము. శ్రీ శివశంకర శాస్త్రిగారు పండితులు, కవి. వీరి రచనాపటిమ అనర్గళమైనది. ఈ కావ్యము చక్కని మృదుమధుర శైలిలో సామాన్య ప్రజలు సయితం పఠించి ఆనందించ తగినదిగానున్నది.

ఉత్తమకవితా సాంప్రదాయాలతో భావరసోపేతంగా నొప్పుచున్న యీ గ్రంథము సర్వప్రజాదరణను పొందగలదు.

# సంపాదకీయములు

## ఆశా రేఖలు

భారత ప్రధాని ఐరోపా పర్యటన ప్రభావం జినీవాలోజరిగిన శిఖరాగ్ర చర్చలపై ప్రస్ఫుటించిందంటే విశేషము లేదు. జాతీయ, అంతర్జాతీయ రంగాలల్లో పండిత నెహ్రూ నాయకత్వము ప్రపంచ కల్యాణాన్ని, ప్రజా శ్రేయస్సును సుగమంచేస్తూ భారత జాతీయతయొక్క విశిష్టతను, వ్యక్తిత్వాన్ని మెరుగులు దిద్దుతూ మానవకోటిలో భయ సంకోచాలను పారద్రోలి ఆత్మ బలాన్ని పూరిస్తూ శాంతి సౌభాగ్యముల దెసకు నడుపుతున్నది.

పూజ్య గాంధీజీ అనుచరుడు, త్యాగి, జాతీయ పురోభివృద్ధికేకాక అంతర్జాతీయ రంగంలో సయితం అనేక క్లిష్ట సమస్యల పరిష్కారానికి మార్గదర్శి కావడంతో ప్రపంచ చరిత్రలోనే సుప్రసిద్ధుడైనాడు పండిత నెహ్రూ.

ఈ నాటి స్వాతంత్ర్య దినోత్సవాల సందర్భమున, దేశసేవచేసి వీరోచితంగా పోరాడి స్వాతంత్ర్య సమరాన్ని ద్విగుణీకృతంచేసి తమ అఖండ త్యాగాలతో ఘనవిజయాలు సాధించిన గాంధీజీ నాయకత్వాన్ని, జాతీయ వీరుల స్మరించడంతోబాటు, ఆరాధించడంతోబాటు పండిత నెహ్రూ నాయకత్వమును మరింత పటిష్టంచేసి, ఆయన ననుసరించి జాతీయ పురోభివృద్ధిని తీర్చి దిద్దుకోడానికి దీక్షా కంకణం కట్టుకోవాలి.

ప్రజా సహకారంతోటి, అండదండలతోటి పండిత నెహ్రూ మరింత ఉత్సాహంగా జాతీయ, అంతర్జాతీయ సమస్యల పరిష్కారమునకు కృషి చేయగలడు.

## అవినీతి నిర్మూలనం

ప్రభుత్వోద్యోగులలో అవినీతి నిర్మూలనమునకు, కేంద్రమంత్రి వర్గశాఖలకు పండిత గోవిందవల్లభపంత్ ఒక పథకం తయారుచేయడం, దాని నాచరణలో పెట్ట పూనుకొనుచుండటం సంతోషింపతగిన విషయము. కాని యీ అవినీతి నిర్మూలన సందర్భమున సామాన్య ప్రజానీకం సయితం అప్రమత్తులై తమ హక్కులను, అవకాశములను గుర్తించి బాధ్యతా యుతంగా వ్యవహరించాలి.

ప్రజాసహకారంతోనే ప్రభుత్వమైనా ప్రజా శ్రేయస్సును తీర్చి దిద్ది, అవకాశాలను, హక్కులను కాపాడ గలదు. కేంద్ర ప్రభుత్వము ఆచరణలో పెట్టనున్న పథకాన్ని రాష్ట్ర ప్రభుత్వాలు సయితం అమలునందుంచి సామాన్య ప్రజానీకపు కష్టనిష్టూరాలను బాపగలవని ఆశిద్దాం !

## ఉత్తర దక్షిణ భారతాల మధ్య సామరస్యం

దక్షిణ, ఉత్తర భారతాల మధ్యసామరస్య సాధనకు రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్ చూపుచున్న శ్రద్ధా సక్తులు అభినందించ తగినవి. దానిని సద్భావంతో ఉభయప్రాంతాల ప్రజలు గ్రహించి పరస్పర సహకార సానుభూతులు కలిగి విశాల దృక్పథంతో కృషి సల్పితే భారతదేశం అజేయమేకాకుండా సౌభాగ్య వంతం కాగలదు



# శ్రీ మన్మథనామ సంll ర శ్రావణ, భాద్రపదమాసములు

| నెల | తేది | వారం | వివరములు |
|---|---|---|---|
| 1955 సంll ఆగస్టు నెల | 16 | మం | చతు 51.33 పుష్య 47.40 మాసశివరాత్రి |
| | 17 | బు | ● అమా 47.14 ఆశ్రే 45.12 |
| | | | **భాద్రపదమాసము** |
| | 18 | గు | శుక్లపాడ్యమి 44.4 మఖ 43.46 మొహరం |
| | 19 | శు | వి 41.58 పూఫ 43.33 త్యా 3.59 |
| | 20 | శ | త 41.10 ఉఫ 44.34 |
| | 21 | ఆ | చ 41.36 హస్త 46.42 త్యా 4 9 అమృతశిద్ధియోగం |
| | 22 | సో | పం 43.10 చిత్త 50.5 |
| | 23 | మం | ష 45.47 స్వాతి 54.23 త్యా 4.17 |
| | 24 | బు | స 49.17 విశా 59 32 |
| | 25 | గు | అ 53 23 అనూ 60.10 |
| | 26 | శు | న 57.50 అనూ 5.18 త్యా 4.24 |
| | 27 | శ | ద 60.10 జ్యే 11.16 |
| | 28 | ఆ | ద 2.33 మూ 17.14 త్యా 4.23 |
| | 29 | సో | ఏ 6.41 పూషా 22.55 దగ్ధయోగం |
| | 30 | మం | ద్వా 10.35 ఉషా 28.11 త్యా 4.18 |
| | 31 | బు | త్ర 13.45 శ్ర 32.39 |
| 1955 సంll సెప్టెంబరు నెల | 1 | గు | చతు 15.55 ధ 36.9 |
| | 2 | శు | ○ పౌ 17.27 శత 38.33 |
| | 3 | శ | కృపా 16.52 పూభా 39.45 త్యాజ్యాభావః |
| | 4 | ఆ | వి 15-37 ఉభా 39.41 త్యా 4.0 భానువిదియ |
| | 5 | సో | త 13-5 రేవ 38-26 |
| | 6 | మం | చ 9-23 అశ్వ 36.3 అమృతసిద్ధియోగం |
| | 7 | బు | పం 4-42 షష్ఠ్యం 54-41 భ 32-50 |
| | 8 | గు | స 53.7 కృ 28.53 |
| | 9 | శు | అ 46.33 రో 24.27 దగ్ధయోగః కణ్ణన్ తిరునక్షత్రం |
| | 10 | శ | న 39.58 మృ 19 51 సిద్ధయోగః |
| | 11 | ఆ | ద 33-36 ఆర్ద్రా 15.20 |
| | 12 | సో | ఏ 27.42 పున 11.12 దగ్ధయోగః |
| | 13 | మం | ద్వా 22.30 పుష్య 7.37 తిథిద్వయం |
| | 14 | బు | త్ర 18.12 ఆశ్రే 4.56 మాసశివరాత్రి |
| | 15 | గు | చతు 15.0 మఘ 3 17 త్యా 3.58 |

Printed & Published by Dr. S. Seshagiri Rao, at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor . C. C. Punniah.




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-8-0. అర్ధసంవత్సరపు చందా రు. 2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంధికము గాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితలకట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసము లందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు "కేసరికుటీరం లిమిటెడ్," పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

